ఓమ్

# అనుష్ఠాన వేదాంతము.

( శ్రీ వివేకానంద ప్రవచనము. )



అనువాదకులు:

తత్త్వానందస్వామి.






తృతీయ ముద్రణము 1000 ప్రతులు.

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు.

వెల] 1949 [0—12—0

వలయువారు క్రింది విలాసమునకు వ్రాయవలయును:—

మేనేజరు, శ్రీవ్యాసాశ్రమము, ఏర్పేడు పోష్టు.
(చిత్తూరు జిల్లా.)

CI

# శ్రీ సద్గురు మలయాళస్వాములవారి గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీ శుష్కవేదాంత తమోభాస్కరము | ... | 3—0—0 |
| 2 | స్వబోధసుధాకరము | ... | 1—8—0 |
| 3 | ఓంకారము (ప్రణవోపాసన) | ... | 1—4—0 |
| 4 | ప్రశ్నోత్తర మాణిక్యమాల | ... | 2—0—0 |
| 5 | ధర్మసేతువు | ... | 4—0—0 |
| 6 | [illegible] | | —0 |
| 7 | [illegible] | | —0 |
| 8 | [illegible] | | —0 |
| 9 | [illegible] | | —0 |
| 10 | [illegible] | | —0 |
| 11 | [illegible] | | —0 |
| 12 | [illegible] | | —0 |
| 13 | [illegible] | | —0 |
| 14 | [illegible] | | —0 |
| 15 | [illegible] | | —0 |
| 16 | [illegible] | | —0 |
| 17 | శ్రీ వేంకటేశాది పూజాపంచరత్నమాల | ... | 0—12—0 |
| 18 | ధ్యానామృతము | ... | 0—8—0 |
| 19 | బ్రహ్మవిద్య | ... | 0—12—0 |
| 20 | సన్న్యాసయోగము | ... | 1—2—0 |
| 21 | మాయనుమాయము చేయుట | ... | 0—12—0 |
| 22 | గురుభక్తిప్రభావము | ... | 0—12—0 |
| 23 | బుద్ధోపదేశము | ... | 0—2—0 |
| 24 | సాధుదర్శనము | ... | 0—4—0 |
| 25 | సుప్రబోధము | ... | 0—4—0 |
| 26 | సాంఖ్యయోగము | ... | 0—4—0 |

# పీఠిక.

శ్రీ వివేకానంద స్వాములవారి పేరు వినని వారుండరు. వారి ఉపన్యాసముల ఉత్కృష్టతను ముందుగా వివరించుచు ఉపోద్ఘాతముల రచించుట ముంజేతి కంకణమునకు అద్దము పట్టుటవలె ఉండును. అటుల వ్రాయుట అనవసరము.

వేదాంతమనగానే మహాజ్ఞాన సంపన్నులును తపోనిష్ఠాగరిష్ఠులును ప్రపంచ వ్యావృత్తి రహితులును ఏ నలుగురో జిజ్ఞాస చేయదగిన విషయమను దుర్భ్రమ కలదు. కాని వేదాంతము అనునది ఒక విశ్వశరణ్యమగు మత సిద్ధాంతము. సింహాసనాసీనులై సామ్రాజ్యములను పాలించు ప్రభువులకును, ఘోరసంగ్రామములందు సైన్యముల నడుపు సేనానులకును, శాసన సభలందు ఉపవిష్టులై దేశక్షేమములను అరయుచుండు స్మృతి కర్తలకును, కర్మాగార ప్రతిష్ఠాపనల గావించి దేశైశ్వర్యముల కూర్చుచుండు శిల్పులకును, పణ్యస్థలమునందు వాణిజ్యము నడుపు వర్తకులకును, కూలి నాలి చేసికొని జీవించు పేదలకును, భిక్షాటనముచేసి జీవించు దరిద్రులకును, ప్రజాసేవజేయు దేశారాధకులకును, ఆబాల గోపాలమునకును సమస్త దేశముల వారికిని, సర్వకాల సర్వావస్థలందును వేదాంతము ఎటుల అనుష్ఠానయోగ్యమో కండ్లకు కట్టినటుల ఈ యుపన్యాసములందు శ్రీ స్వాములవారు స్పష్టీకరించియున్నారు.

ఈ అంశములను ఇంగ్లీషురాని నా ఆంధ్రసోదరులు గ్రహించుటలో నాయనువాదము ఒక్కింత ఉపకరించెనా నేను ధన్యుడనగుదును. ఇట్టి ఉత్తమగ్రంథములను అనువదించుట సులభముకాదు. నాయోపినంత ప్రయత్నించితిని.

శ్రీ

తప్పులను త్రోసిపుచ్చి ఒప్పులనే గ్రహించి, శ్రీ వివే కానంద స్వాములవారి బోధామృతమును ఎల్లరును ఆస్వా దించి అలరుదురు గాక!

లోకాస్సమస్తా స్సుఖినో భవంతు.

అనువాదకుడు.

# అనుష్ఠాన వేదాంతము.

౧-వ భాగము.

---

## వేదాంతము అనుష్ఠానయోగ్యము.

వేదాంత శాస్త్రముయొక్క అనుష్ఠాన పక్షమును గూర్చి కొంత ముచ్చటించుఁడని కోరియుండిరి. సిద్ధాంత పక్షము చాల శ్రేష్ఠమైనదని తెలిపియుంటిని. కాని దానిని మనము అనుష్ఠానములో పెట్టుటెట్లు? అనుష్ఠానమున బొత్తుగా ఉపకరించని సిద్ధాంతము ఎంత ఘనతరమైనదైనను బుద్ధికి పరిశ్రమసాధనముగనుంట తప్ప నిష్ప్రయోజనమే యగును. కావున వేదాంతము మతధర్మమంటిమేని అది పూర్ణముగ ఆచరణయోగ్యమై యుండవలయును; సర్వావస్థలందును మన జీవితమున మనము అనుష్ఠింపఁదగినదిగ ఉండవలయును. ఇంతియే కాదు; మతమునకును, లౌకిక వ్యవహారములకునుగల కృత్రిమ వైషమ్యము తొలఁగి పోవలసియున్నది. ఏలయన వేదాంతము ఏకత్వమును బోధించును; అనగా జీవనము సర్వ విషయములందును అభిన్నముగ నుండవలయునని శాసించును. మతాదర్శములు జీవితమునందెల్ల సంపూర్ణవ్యాప్తిగలవై మన సంకల్పములందంతటను ప్రతిఫలించి అనుష్ఠానములోనికి రావలయును. పోనుపోను నేను అనుష్ఠానాంశమునుగూర్చి వివరించెదను. ఈ నా ఉపన్యాసావళి మనకు మూలాధారముగ ఉపకరింపవలయునుగాన మనము మున్ముందుగా సిద్ధాంతభాగమును గూర్చి విచారించుట ముఖ్యము. ఇట్టి సిద్ధాంతములు ఆదియందు వనగుహాంతరములనుండి వెలువడి క్రమముగా సంతతసంచలనపూరితములగు వ్యాపారప్రదేశములకును నగరముల

కును వ్యాపించి యెట్లు పరిణామమును పొందినవో గ్రహించ వలసియున్నది. ఇందొక వింతసంగతినిగూడ గమనించఁగలము ఈ భావములు చాలవఱకు వనములలో ముక్కుమూసికొని కూర్చుండినవారివలనగాక అత్యంతము తీవ్రప్రవృత్తిచే నొప్పు వారివలన అనఁగా రాజ్యపాలనముచేయు చక్రవర్తులవలన ప్రచారము గాంచియుండినవి.

శ్వేతకేతు అరుణియనువాని కుమారుడు. ఆయనయొక ఋషియో, సన్యాసియో యైయుండును. అరణ్యములందు పెరిగినవాఁడు. ఆయనకొమారుఁడు పాంచాల రాజధానీ నగరమునకుఁ బోయి ప్రవహనజైవాలియను రాజుయొక్క ఆస్థానమును దర్శించెను. "మరణించునప్పుడు జీవుఁడెట్లు వెడలునో యెఱుగుదువా?" అని రాజు ప్రశ్నించెను. "అయ్యా! తెలియద"ని ఆఁతడు ప్రత్యుత్తరమిచ్చె. "వారిక్కడికి ఎట్లు వత్తురో తెలియునా?" అని మఱల రాజడిగెను. ఆతఁడు 'తెలియదండీ' అనెను. "నీవు పితృయానములను దేవయానములను తెలిసికొంటివా?" అని యడుగగా అదియు తెలియదనె. అంతట రాజు మఱికొన్ని ప్రశ్నల నడిగెను. శ్వేతకేతు వానికిఁ ప్రత్యుత్తరము లీయఁజాలఁడయ్యె. కావున వానికేమియు తెలియదని రాజు పలికెను. ఆ బాలుఁడు తిన్నగఁ తన తండ్రికడకేగి అడుగగా ఆయనయును ఈ ప్రశ్నలకు జవాబు చెప్పఁజాననని ఒప్పుకొనెను. ఆయన అట్లనుట పిల్లవానికి ఆవిషయము బోధింప నిష్టములేకగాదు; నిజముగా ఆయంశములు ఆయనకే తెలియవయ్యె. అంతట శ్వేతకేతుఁవును వాని తండ్రియు రాజునొద్దకుపచ్చి తమకు ఆ రహస్యముల బోధింపుడని వేడిరి. ఈ విషయములు అంతవరకును రాజులకుమాత్రమే తెలిసియుండెననియు, విప్రులకుఁ తెలియ

కుండెననియు రాజు చెప్పి అనంతరము వారు కోరినదానిని బోధించెను. కాబట్టి ఈవేదాంత తత్వము వనములలోఁ తపమాచరించుట మాత్రముననే సిద్ధించినదికాదనియు, అందలి మహోత్కృష్టభాగములు అనేకములు లౌకికవ్యావృత్తులందు నిమగ్నులై వర్తిలిన ధీమంతులచే గ్రహింపఁబడినవనియు ఉపనిషత్తులలోఁ తెలుపఁబడి యున్నది. నిరంకుశ ప్రభువులై కోట్లకొలంది ప్రజలఁ పాలించువారికంటె హెచ్చుగ ప్రవృత్తచిత్తులగువారిని మనము ఊహింపఁజాలముగదా! అయినను ఇట్టి ప్రభువులలోఁ కొందఱు మహా మనీషాగ్రగణ్యులై వఱలగల్గిరిసుడీ.

## వేదాంత పరమావధియే కర్మరహస్యము.

కాన తత్వశాస్త్రము సర్వవిధముల అనుష్ఠాన యోగ్యమై యుండి తీరవలయుననియే తేలుచున్నది. మీలో అనేకులు భగవద్గీతను జదివి యుందురు. ముందు ముందు దాని విచారణకుఁ గడంగినప్పుడు వేదాంత తత్వశాస్త్రమునకు అది ఒక ఉత్తమోత్తమమయిన వ్యాఖ్యయని గ్రహింపఁజాలుదుము. దానిం బోధించిన క్షేత్రము రణరంగమై ఉండుటయు విచిత్రము. శ్రీకృష్ణుఁడు ఈతత్వశాస్త్రమును అర్జునునకు అట్టిచోట బోధించియున్నాఁడు. ఈ గీతయొక్క ప్రతిపుటయందును ప్రస్ఫుటమై వెలుంగు సిద్ధాంతము ఏదన "తీవ్రప్రవృత్తియు, దానియందుండు తఱిని నిరంతరశాంతియు" నై యున్నది. వేదాంతమునకుఁ పరమావధియగు ఈసిద్ధాంతమే కర్మరహస్యము. 'అకర్మ' అనగా మనమనుకొనునట్టి నిష్క్రియత వేదాంత పరమావధి కాఁజాలదు. అటులైనచో మనచుట్టునున్న గోడలే అత్యంత మనీషావంతములనఁవలసి

వచ్చును. అవి సంపూర్ణముగ నివృత్తిచే నొప్పుచున్నవి. మట్టి సుద్దలు, మోడుచెట్లు, ప్రపంచములోనికెల్ల సాధుసత్తములై యొప్పును; అవిసంపూర్ణముగ క్రియా రహితములుగదా? మఱియు కామముతోఁగూడిన ప్రవృత్తియు యుక్తమగు ప్రవృత్తియనిపించుకొనదు. వేదాంతము బోధించు పరమావధియగు ప్రవృత్తి శాంతి ప్రపూర్ణమైయుండును. ఆ శాంతికి చలనముండఁజాలదు. ఏమి వాటిలినను ఆచిత్త స్థైర్యము చలింపదు. అటువంటి స్థితియే కర్మ చేయుటకు మిక్కిలి అనుకూలమగు అవస్థయని జీవితానుభవమువలన అందరెఱుంగుదురు.

మనము సామాన్యముగ అనుభవించు కార్యాందోళన బోలు తీవ్రవాంఛ లేనిదే మనము ఏకార్యమునేని చేయుట ఎట్లు పొసఁగును? అని నన్న నేకులడుగుచుండ్రు. చిరకాలము క్రిందట నేనును అట్లే తలఁచి యుంటిని; కాని పెద్దవాడనైన కొలఁదిని అనుభవము చేకూరినకొలఁదిని, అందుసత్యము లేదని యెఱింగితిని. ఆందోళన తగ్గినకొలదిని ఉత్కృష్టకర్మను చేయగల్గుదుము. ఎంతశాంతి యలవడిన అంత శ్రేయము; అంత యెక్కువపనిని మనము చేయగల్గుదుము. మన చిత్తవృత్తులను విచ్చలవిడి వదలినకొలఁదిని మనసత్వము వృథయగుచుండును. మనోనాడులు భిన్నములగుచుండును. మనస్సుపీడన నొందుచుండును. మనముసాధించఁగల కార్యము స్వల్పమైపోవుచుండును. కార్యరూపమునఁ ప్రకాశమునకు రాఁదగిన శక్తివ్యర్థమగు పరితాపరూపమున వ్యయమైపోవును. మనస్సు శాంతితోఁగూడి యున్నప్పుడే మనశక్తియంతయు కార్యసాధనయందు వినియోగపడఁగలదు. ఈ ప్రపంచమున ప్రభవించిన

ఘనతరకార్యశీలుర జీవితములను పరికించి చూచితిమేని, వారందఱును అద్భుతశాంతిమంతులని గ్రహింపగలము. ఏమైనను కానిండు, అట్టివారు చలింపరు. కావుననే, కోపము వచ్చిన యతఁడుమిగుల పనిచేయఁజాలడు. ఏమిచేసినను కోపము నందనివాడు ఎంతయో సాధింపఁగలఁడు. కోపముగాని ద్వేషముగాని మతోద్రేకముగాని పూనినవాఁడు పనిచేయఁజాలఁడు; తల పగులఁగొట్టుకొనియు ఈషన్మాత్రమేని ప్రయోజనకరమగు పనిచేయఁజాలడు. శాంతి శమదమాదులంగూడిన బుద్ధి మహాత్కార్యముల సాధించగలదు.

## ఆదర్శము.

ఈ ఆదర్శమును వేదాంతముద్బోధించుచున్నది. ఆదర్శము ఎల్లప్పుడును ప్రత్యక్షానుభవమునకు అతీతమై నెలుంగుచుండునని మన మెఱుఁగుదుము. అనఁగా మనముసాధింపగల్గిన దానికి మించియుండును. నరునిస్వభావమందు రెండు కడఁకలు (యత్నములు) గలవు. ఒకటి ఆదర్శమునువంచి జీవితముతో సామరస్యమును గూర్పయత్నించును; రెండవది జీవితమును ఆదర్శముచేరునట్లు ఉద్ధరించుటకు గడంగును. దీనిని గ్రహించుట చాల గొప్పసంగతి. ఏలయన మొదటియత్నమే సామాన్యముగ మనజీవితములఁ బ్రేరేపించు చుండును. ఏదో యొక విధమగు పనిని మాత్రమే చేయఁగలనని నా అభిప్రాయము అనుకొనుడు. అందుచాలభాగము చెడ్డది కావచ్చును; క్రోధము, లోభము, మోహము మున్నగు చిత్తవృత్తులచేఁ బ్రేరణగాంచునదై యుండనోపు. అప్పుడెవరేని నాకొక ఆదర్శమును బోధింపవచ్చి, అందు ప్రథమ సోపానముగా స్వార్థమును భోగమును విడువుమనిన నేమో, నాకది సాధ్యముకాదని

తోఁచును. కాని అతఁడు నాస్వార్థమునకు భంగములేని ఆదర్శమును చూపిన యెడల సంతసించి తత్క్షణము ముందుకు దుముకుదును. అది నాకనుకూలమగు ఆదర్శము! "శిష్టత్వము" అను పదమువలెనే "సాధనీయము" అను శబ్దమును పలురీతుల అర్థముచేయఁబడుచున్నది. "నా ఆచారము శిష్టాచారము; నీఆచారము దురాచారము". "సాధనీయము" అనునదియు ఇట్లేయున్నది. నేను ఆచరణీయము అనుకొనినదే ప్రపంచమున ఆచరణయోగ్యమై నాకు తోఁచును. నేనొక అంగడిపెట్టుకొను వాఁడనైతినా అంగళ్ళు పెట్టుకొనుటే ప్రపంచమున ఆచరణయోగ్యమగు వృత్తియని భావింతును. నేనొక దొంగనైతినా దొంగతనముచేయుటే అనుష్ఠానపరునకు దగినకార్యమని తలఁతును; తదితరములు ఆచరణయోగ్యములుగ కాన్పింపవు. "అనుష్ఠానము" అను మాటను మనకిష్టమైనట్టియు మనము చేయఁగలట్టియు విషయములకు అనుసంబంధముచేసి ఎట్లు వాడుదుమో తెలిసికొంటిరా! కాఁబట్టి వేదాంతము అత్యంతము అనుష్ఠానయోగ్యమను నప్పుడు ఆదర్శమును అర్థములో మాత్రమే అటులగుచున్నదని గ్రహించఁగోరెదను. ఆ ఆదర్శము ఎంత ఉన్నతమైనదైనను, కేవలము అసాధ్యమగు ఆదర్శమును వేదాంతము బోధించుచున్నదనుటయుఁ దగదు; ఆ ఆదర్శము అత్యున్నతమనుట నిజమే, ఒక్కమాటలోఁ జెప్పెదను; ఆ ఆదర్శము "తత్వమసి"—నీవు బ్రహ్మము. ఇదే వేదాంత తత్వసారము. దీనిని పృథక్కరణము చేసి చేసి బుద్ధివ్యవసాయము గావించితిరేని నరునిఆత్మ పవిత్రమును, సర్వజ్ఞమునని మీరు గ్రహించఁగలరు. ఆత్మనుగూర్చి మాటలాడునప్పుడు జననము మరణము అను మూఢవిశ్వాసములన్నియు వెఱ్ఱి అని తేలును. ఆత్మ యెన్నఁడును జననముగాంచి యుండ

లేదు, ఎన్నడును మరణించదు. మనము చత్తుమని తలచుట, చావునకు భీతిలుట కేవలము మూఢత్వము. మనము దీనిని చేయఁగలము, దానిని చేయఁజాలము, అను భావములును వెఱ్ఱివే. మనము సకలమును చేయఁగలము. వేదాంతము నరునకు ఆత్మవిశ్వాసమును బోధించుచున్నది తనకు అతీతుఁడయిన సగుణబ్రహ్మ యొకఁడు కలఁడని విశ్వసించనివాఁడు నాస్తికుఁడని ప్రపంచమందలి కొన్నిమతములు బోధించురీతినే తనయందు తనకు విశ్వాసము లేనివాఁడు నాస్తికుఁడని వేదాంతము బోధించుచున్నది. మనఆత్మయొక్క మహిమను మనము విశ్వసించకపోవుటే నాస్తికతయని వేదాంతము ఉపదేశించుచున్నది. అనేకులకు ఈభావము మహాదారుణముగ తోచుననుటకు సందియములేదు. ఈఆదర్శము మనము ఎన్నడును చేరునదికాదు అని అనేకులు అనుకొందురు; కాని ప్రతివాడును దానిని పొందగలడు, అనియే వేదాంతము నొక్కి వక్కాణించుచున్నది. వేదాంత సిద్ధాంతానుసారముగా చూచునెడల అది యీవఱకే సిద్ధించియున్నందువలన, ఈ ఆదర్శప్రాప్తికి స్త్రీ, పురుషుడు, శిశువు అను తారతమ్యములుగాని, జాతిమత భేదములుగాని, యింక నేవియుగాని అడ్డుపడజాలవు.

జగత్తునగల సర్వశక్తులును ఇదివఱకే మనయందున్నవి. మనంతట మనమే కండ్లపై చేతులనుపెట్టుకొని చీకటిగ నున్నదని విలపించుచున్నాము. మనలను ఆవరించు చీకటియే లేదని గ్రహించుడు. చేతులను తొలగించుకొనుడు; అనాదియై వెలుంగు తేజము గోచరించును. ఎన్నడును చీకటియే లేదు; దుర్బలత యెన్నడునులేదు. మనమే వెఱ్ఱులమై దుర్బలురమని వాపోవుచున్నాము; మనమే పిచ్చివారలమై పాపులమని

విలపించు చున్నాము. ఈఆదర్శమిప్పుడు నుసాధ్యమను టేగాక అనాదినుండియు లభ్యమైయే యున్నదనియు, ఈ ఆదర్శము (ఈ సత్యతత్త్వము) మన స్వభావమే అనియుకూడ వేదాంతము వక్కాణించుచున్నది. నీకు కాన్పించు తదితర మంతయు అసత్యము; బూటకము. "నేనొక అల్పుడనగు మర్త్యుడను" అని నీవనగానె అసత్యమును పలికినవాడవగు చున్నావు; నిన్ను నీవే మోసగించుకొనుచున్నావు; ఇంద్రజాలమునకు లోనై నీయంతట నీవే నీచుడవును, క్షుద్రుడవును, దౌర్భాగ్యుడవును అని భ్రమించుకొనుచున్నావు. ఈ ఆదర్శము పాపమును అంగీకరింపదు; పొఱబాటనుటను అంగీకరించును. మఱియు నీవు దుర్బలుడవనియు, పాపుడవనియు, దీనుడవనియు, శక్తిహీనుడవనియు, దేనినిగాని సాధింపజాలనివాడవనియు పలుకుటయే అన్నిటిని మించినపొఱబాటని వేదాంతము బోధించుచున్నది. అటుల నీవనుకొనినప్పుడెల్ల నిన్ను బంధించు గొలుసునకు నీవొక కడియమును జేర్చుకొనినట్లగును. నీఆత్మను ఆవరించిన జాలమునకు ఇంకొక పొఱను చేర్చుకొనినట్లగును. కాబట్టి తాను దుర్బలుడనని తలచువాడెల్ల దోషి యగుచున్నాడు. తాను అపవిత్రుడనని తలచువాడెల్ల పొఱబడుచు, లోకమునకొక దుష్టభావమును బ్రచారముచేసినవాడగును. ఇప్పటి మనజీవితమును, ఇంద్రజాలములోబడిన ఈ జీవితమును, మనము ఆరోపించుకొనిన ఈ అసత్యజీవితమును, ఆదర్శముతో సరిపెట్టు యత్నమే వేదాంతమున లేదనియు, ఈ మాయాకల్పితజీవితము పోయి, నిత్యసత్యజీవితము ప్రకటితమై ప్రకాశించవలసియున్నదనియు, మనము సదాజ్ఞప్తి నుంచుకొనవలయును. ఏ నరుడుగాని ఒక

ప్పటికంటె ఇంకొకప్పుడు హెచ్చుగ పవిత్రుడుకాబోవుటలేదు; నైజమైయున్న పవిత్రతను హెచ్చుగా ప్రకాశమునకుఁ తెచ్చుకొనుచున్నాఁడని చెప్పవలయును. పొఱలు తొలగిపోయిన కొలదిని ఆత్మయొక్క సహజపావనత్వము ప్రకాశమునకు వచ్చుచుండును. సచ్చిదానందములును సర్వశక్తియు అన్నియు సదా మనవై యే యున్నవి!

## వేదాంతము సామాన్యులకొఱకే.

వనాంతరములందును గుహాంతరములందును వసించువారు ఈ రహస్యమును గ్రహించఁగల్గుటేగాక, సకల జీవితావస్థలందుండువారును దీనిని అనుభవమునకు తెచ్చుకొనఁగలరనిగూడ వేదాంతము బోధించును. ఈరహస్యములను కనుగొనినవారు వనములందును గుహలందును వసించువారు కారనియు, సామాన్యపు వృత్తులచే జీవించువారును కారనియు, అత్యంత ప్రవృత్తితో నేసలనడుపువారును, (రాజులు దాదాపు కీలుబొమ్మలై పోయిన యీ కాలమునందుగాక, నిరంకుశసర్వాధికారకలితులై వర్తించిన కాలమున) కోట్లకొలంది ప్రజల క్షేమములను అరయుచు సింహాసనాధిష్ఠులైయున్న ప్రభువులును ఈ రహస్యముల కనుగొనిరని నమ్ముటకు తగిన కారణములు మిక్కుటముగఁ గలవు. అట్టివారు ఇట్టి భావనలను ధారణచేయుటకును, అపరోక్షానుభూతికి తెచ్చుకొనుటకును, లోకమునకు బోధించుటకును కూడ అవకాశములు లభించుచుండెను. అట్టివారి జీవితములతో పోల్చిచూచినయెడల, నిరంతరవిశ్రాంతిచే నొప్పును అనదగు జీవితముల గడుపుమనకు అది యెంత సుసాధ్యమై యుండవలయునో యోచించుడు చేయుట కంతగా పనిలేక

మెల్లెడల, తీరుబాటుగలిగిన మనము ఆ ఆదర్శమును గ్రహిం పజాలకుండుట ఎంతయు లజ్జాకరముగదా! పూర్వపు సర్వాధి కారప్రభుని తాపత్రయములతో పోల్చినయెడల నాయువి గణ నకే రాజాలవు. పెద్దసేనను నడుపుచు కురుక్షేత్రరణరంగమున నిలిచిన అర్జునునికిగల అవసరములతో సరిపోల్చిన నాకు గలవి పూజ్యమనవచ్చును. అయిననుగూడ రణగుణధ్వనిలో మునిగి యున్న అతడు పరతత్వరహస్యములఁగూర్చి ప్రసంగింపగలిగి నాడు; తన జీవితమున నాచరించుటకును శక్తుడై నాడు. హెచ్చుగ తీరుబాటుగలిగి, పాటుబడు నవసరములేక, సుఖ జీవనముచేయు మనజీవితములందు ఆపాటి అవకాశము ఉండియే తీరును. సద్వినియోగము చేయుటకు నిజముగా సంకల్పించితి మేని, మనము అనుకొనుదానికంటె చాల హెచ్చునావకా శము మనలో అనేకులకు లభించగలదు. పూర్తిగ ప్రయ త్నించితిమేని మనకున్న విశ్రాంతితో మన యీ జీవిత ములో రెండువందల ఆదర్శములను సాధించగలము. అయి నను ప్రత్యక్షానుభవమునకు జేరువగునంతగా, ఆదర్శమును క్రిందికి పడలాగదగదు సుడీ! మనము కావించు లోపములన్నిం టికిని సాకులు కల్పించుచు, మన వెర్రికోరికలకును, వెఱ్ఱి తలంపులకును, సాకుల సృష్టించుటను నేర్పుచు దరిజేరువారుంట మహానర్థకము; మనమో వారు చూపు ఆదర్శమునే ఉత్త మముగా భావింతుము. అటుల గావించదగదు. వేదాంతమటు వంటి బోధను కావించుటలేదు. స్వీయానుభవమును ఆదర్శము తోడి సామరస్యము గలదానిగ ఉద్ధరించవలెను. మన యీ జీవితమును శాశ్వతజీవితముతో సరిపోలుదానిగ ఉద్ధరించ వలయును.

వేదాంతమూలభావము ఈ ఏకత్వమే (ఐక్యతయే) అని మీరు జ్ఞప్తి నుంచుకొనవలయును. దేనియందును ద్వైతమును గనలేము. రెండు జీవనములు లేవు; రెండు లోకములు, రెండు భిన్నములగు జీవితసరణులు లేవు. వేదములు మొదట ఊర్ధ్వ లోకములు మొదలగువానిం గూర్చి ప్రశంసించినను, పోనుపోను తత్వపరమావధినిగూర్చి తెలుపుచో వాని నన్నింటిని త్రోసి వేయుచున్నవి. ఒకే జీవితము, ఒకే ప్రపంచము, ఒకే అస్తిత్వము, సర్వమును యేకమే. అంశభేదమేగాని జాతిభేదము లేదు. మనజీవితములందు కాన్పించు భేదమురకముమారి కలిగిన భేదముగాదు. పశువులు నరులకంటె భిన్నములనిగాని, అవి నరుని కాహారముగానుండ సృష్టింపబడెననిగాని యెంతమాత్రమును వేదాంతము అంగీకరించదు.

## జంతువధ.

కొందఱు శాస్త్రపరిశీలనార్థమును జంతు సంహారము కూడదని బోధించు సంఘమును దయార్ద్రులై స్థాపించిరి. అట్టి సంఘసభ్యులలో నొకరిని "మిత్రమా, శాస్త్రీక పరిశోధనార్థమొకటి రెండు జంతువులను చంపుట అధర్మమని బోధింతురు గదా! ఆహారార్థము చాలజంతువుల చంపుట ధర్మమేయని భావింతురేల?' అని అడిగితిని. "శాస్త్రపరిశీలనార్థము ఖండించుట మహాఘోరకార్యము. మన యాహారార్థమే అవి మన కొసగబడియున్నవి." అని ఆయన ప్రత్యుత్తరమిచ్చెను. ఐక్యత సకలజీవులయందు ఇమిడియేయున్నది. నరుడు శాశ్వతజీవి యైనచో పశువులును అట్టివే. అంశభేదముండెగాని జాతిలో తారతమ్యములేదు. ఏకకణ సూక్ష్మజీవియు నేనును ఒక్కటియే. భేదమున్నచో అది అంశయందుమాత్రమే. అత్యుత్తమ

జీవభావమున ఈభేదములన్నియు అదృశ్యములగును. గడ్డి మొక్కకును చెట్టునకును మధ్య చాలభేదము కాన్పించ వచ్చును. కాని ఎత్తగుపర్వతమునెక్కి చూచినయెడల గడ్డియు మహావృక్షమును ఒక్కటై కాన్పించగలవు. పరమావధిం గూర్చిన దృష్టిలో క్షుద్రజంతువును మానవాగ్రగణ్యుడును ఒక్కటియే. భగవంతుడొకడు కలడను విశ్వాసము మీకు గలదేని, అల్పజీవులును అత్యుత్తమ జీవులును ఒక్కటని అంగీకరించవలసియున్నది. భగవంతుడు నరులనెడు బిడ్డలయెడ పక్షపాతము వహించి, మృగము లనెడు బిడ్డలయెడ క్రూరుడగునో అతడు పిశాచముకంటె హీనుడనవలసియుండును. అటువంటి దేవుని పూజించుటకంటె వందసారులైనను మరణించుట నాకిష్టము. అట్టి దేవునితో పోరుటకే నాజన్మనంతను వినియోగించెదను. కాని అట్టిభేద మేమియును లేదు; కలదనువారు బాధ్యతను గుర్తించని వారును, ధైర్యహీనులును, అజ్ఞానులునై యున్నారు. "అనుష్ఠానము" అనగా అప్పార్థము చేయుట కలదు. నేను కేవలము శాకాహారము తీసికొనువాడను గాకపోవచ్చును. కాని ధర్మము నెరింగి యుండవచ్చును. నేను మాంసమును తినునప్పుడది తప్పని యెఱిగియుండవచ్చును. కొన్ని పరిస్థితులలో తప్పక తినవలసినవాడనయినను అది క్రూరకర్మమని యెరుగుదును. అందుచేత ఆదర్శమును ప్రత్యక్షాచరణకు దింపి, నావర్తనము నెన్నడును సమర్థింపజూడదగదు. జంతుహింస చేయకుండుట, మాంసము తినకుండుట ధర్మము. ఏలయందురా ఆజంతువులు నాతోబుట్టువులే. వానియందు నీకు సోదరభావము కుదిరెనేని సర్వాత్మలయెడను సోదరభావమును సాధనచేయుటలో చాల

దూరము పోయినవాడవగుదువు. అప్పుడు మానవసోదరత్వ మునుగూర్చి చెప్పనవసరముండదు. అది బాలక్రీడవలె నుండును. ఇది చాలమందికి హితవుగానుండదనుట నిజము; కాని వారు ప్రత్యక్షానుభవమును విడిచి, ఆదర్శమును చేరునట్లు తీరులు కావలయును. వారి ప్రస్తుతాభ్యాసములకు సరిపోవు సిద్ధాంతమును ఎవనినేని బోధించినప్పుడే వారది పూర్ణముగ అనుష్ఠానయోగ్యమని అంగీకరింతురు.

## పూర్వాచారాభిమానము.

మానవ స్వభావమునందు పూర్వాభ్యాసపరత గాఢముగనున్నది. దానినిదాటి ఒక్క అడుగు పెట్టుట అనిన మనకిష్టముండదు. ఈమానవకోటిని చూడగా మంచులోబడి బిగిసికొనిపోయినవారిం గూర్చి నేను చదివిన విషయము జ్ఞప్తికి వచ్చుచున్నది. అటువంటివారు తాము నిద్రింపగోరుచుంటిమని పలుకుచు, మీరు పైకి లాగజూచినయెడల "మమ్మును నిదురించనిండు; ఈమంచులో నిద్రించుట కడు మనోహరము" అందురట! అట్లుల నిదురించుచునే వారు మరణింతురు. మన స్వభావమును ఇట్లేయున్నది. మన జీవితములందంతటను మనము కావించునది ఇదియే. ఆపాదమస్తకము బిగిసికొనిపోయియు, నిదురింపఁగోరుదుము. కాఁబట్టి మీరు ఆదర్శమును ప్రాప్తించుటకై పరితపించవలయును. ఎవరేనివచ్చి ఆదర్శమును మీరున్న స్థితికిఁదింపివేసి, పరమాదర్శమునకు మీరెక్కి పోనగత్యములేని మతమును బోధింపజూచునెడల వానిబోధ నాలకించకుడు. ఆమతమే అనాచరణీయమనినాదృఢ విశ్వాసము. ఎవరేని పరమావధిని నిరూపించు మతమును బోధించనుండిన నేను వాని ననుసరించుటకు సిద్ధముగనుందును.

ఇంద్రియాడంబరములను ఇంద్రియలోలత్వమును సమర్థింప గడగువారింగూర్చి జాగ్రత్తగనుండుడు. అట్లెవరేని మనకు బోధింపసాగినచో, ఇదివరకే ఇంద్రియములకు కట్టువడి తుచ్ఛ మృత్పిండములై పోయియున్న, మనము ఆబోధను అనుసరించితిమా, మనకు ముందుగతులుండవు. నేనిట్టివానిని చాలచూచినాను. నేను కొంత లోకానుభవము గడించియున్నాను. మతశాఖలు కుక్కగొడుగుల లీల పుట్టుచుండు దేశమునాది. ప్రతిసంవత్సరమును క్రొత్త క్రొత్త మతములు బయలుదేరుచుండును. కాని నేను ఒక్కవిషయమునుమాత్రము బాగుగ గుర్తింపజాలితిని. విషయలంపటుని ధర్మాభిరతుని ఎన్నటను సమముగనెంచనివారు మాత్రమే వర్ధిలజాలిరి. విషయాడంబరములను పరమార్థమును సరిపెట్టజూచి, భగవంతుని మానవుని దశకు ఈడ్చుటకు పిచ్చిప్రయత్నములు చేసినప్పుడెల్ల క్షీణతయే ప్రాప్తించుచు వచ్చినది. పురుషుడు నీచుడై ప్రాపంచిక దాస్యమున కూలతగదు. అతడు తీక్ష్ణుడై భగవంతుని చేరవలయును.

## ఆక్షేపణకాదు; సహకారమే.

మరియు రెండవపక్షమును కూడ విచారించవలయునుసుడీ! మనము ఎవరినిగాని నీచులుగ చూడతగదు. మనమందఱమును ఒకే ఆదర్శమునుంగూర్చి పోవుచున్నాము. బలవంతులకును దుర్బలురకును గల వ్యత్యాసము అంతరమును ననుసరించునది. పుణ్యపాపము లనెడు భేదము అంతర సంబంధమైనదే! అంతరభేదమే స్వర్గ నరకములు! చేతనా చేతనములకు గల భేదమును అంతరభేదమే ! ప్రపంచమునగల తారతమ్యములన్నియు అంతర సంబంధమైనవేగాని జాతి సంబంధమైనవి

గావు. ఏల యందురా అద్వైతమే సర్వము నందును గల తత్వము. సంకల్ప రూపమునగాని, ప్రాణరూపమునగాని, జీవాత్మ రూపమునగాని, శరీర రూపమునగాని ప్రకాశించునది అంతయు నొక్కటియే. భేదమంతయు ప్రకాశమున గల అంతరముచే కానవచ్చుచున్నది! అట్లగుటంజేసి మనతో సమానాంతరముగాఁ బరిణామము పొందియుండని వారిని నీచముగా చూచుటకు మనకర్హతలేదు. ఎవరినిగాని దోషిగా పరిగణింపకుడు. చేయందిచ్చి సాయపడ గల్గుచో అటుల గావించుడు; లేనిచో చేతులముడుచుకొని, ఆమిూసోదరులను ఆశీర్వదించి, వారి త్రోవను వారింబోనిండు. క్రిందికి పడలాగుటగాని, ఆక్షేపించుటగాని కార్యసాధనకు మార్గముకాదు. ఆ మార్గమున కార్యసిద్ధియెన్నడును చేకూరబోదు. ఇతరులను ఆక్షేపించుటలో మనశక్తి దుర్వ్యయమైపోవును. పోను పోను, మన మందరమును ఒకేవస్తువును దర్శించుచుంటిమనియు, ఒకేఆదర్శమును పొందనుంటిమనియు మనలోగలభేదములన్నియును ఆత్మప్రకాశమునందలిఅంతరముచే గల్గు తారతమ్యములనియు తెలిసికొనవలసివచ్చును. కాన ఖండనములును ఆక్షేపణలును మనశక్తిని వృథాచేయు మార్గములే యగుసుడీ.

"పాపము" అను భావనను పరికించుడు. నేనిప్పుడు దాని గూర్చిన వేదాంతభావమును దెల్పితిని. నరుడు పాపియను రెండవ పక్షవాదమున్నది. పర్యవసానమునకు రెండును ఒకటియే; కాని యొకటి సవ్యమైనది, మఱొకటి అపసవ్యమైనది. ఒకటి నరునికి వాని శక్తిని చూపును; రెండవది వానికి వాని దుర్బలతను చూపును. వేదాంతము తెల్పున దేమన, దుర్బలతయుండుఁగాక, లక్ష్యము చేయువలదు. మనము వురోవృద్ధిని

సాగించవలయును. నరునిపుట్టుక తోడనే వాని రోగము తెల్ల మైనది. ప్రతివానికిని వాని రోగము తెలియును. మన రోగ మిదియని మన కెవరును తెలుప అవసరములేదు. రోగమును గూర్చి సదా చింతన చేయుచుండుటవలన రోగము కుదురదు, చికిత్స చేయవలయును. మనము బాహ్య ప్రపంచమునంతను మఱవవచ్చును; బాహ్య ప్రపంచమున కపట వేషములతో దిఱుగ వచ్చును. కాని నిరంతరము మన దుర్బలత మన హృదయాంతరమున ఎఱుకపడుచునే యుండును. కాని యిట్టి మన దౌర్బల్యమునుగూర్చి మనకు జ్ఞాపకము చేయుటవలన సాహాయ్యము చేకూరబోదు; బలము నొసగవలయును; సతతము దుర్బలతనుగూర్చి స్మరించుచుండుట వలన బలము చేకూరదు. దౌర్బల్యమునకు చికిత్స దుర్బలతనుగూర్చి సంస్మరించుట కాజా లదు; బలమును ధ్యానించుట లాభకారి. నరులందు ఇదివఱకే బలమున్నది; దానిని వారికి బోధింపుము. నరులకు మీరు పాపులని బోధించుటకు మారుగా వేదాంతము సవ్యమార్గ మును అనుసరించు చున్నది; 'మీరు పవిత్రులు, పరిపూర్ణులు, మీరు పాపమనుకొనునది మిమ్మంటునదిగాదు" అని ఉద్బో ధించుచున్నది. పాపము అనునది ఆత్మయొక్క ప్రకాశమున కడు నీచాంతరము (చాల క్రిందిమెట్లు) మీ యాత్మలను ఉత్త మాంతరమున (సాంద్రతరముగ) ప్రకాశింప జేయుడు. ఈవిష యమే జ్ఞప్తినుంచుకొనఁ దగినది. మనమందఱమును అటుల చేయగలము. "కాదు; నాచేతగాదు" అని యెన్నడును అన కుడు. మీరు అనంతులు. మీస్వభావముతో సరిపోల్చిన, కాలము, దేశము పరిమితము శూన్యములై తోచును. మీరు సర్వశక్తి సంపన్నులు; దేనిని బట్టిన దానిని సాధించగలరు.

ఇయ్యవి నీతిసూత్రములు! ఒకింత క్రిందికిదిగి వివరముల విచారింతముగాక. అనుదినము మన జీవితములందు, నగర జీవితములందును, గ్రామ్య జీవితములందును, జాతీయ జీవితములందును, ప్రతివానియొక్క స్వీయజీవితమునందును ఈ వేదాంత బోధ ఎట్లనుష్ఠింపదగునో చూతము. నరుడెట్టి వాడైనను, ఎట్టి దశయందున్ననుకూడ వానికి ఉపకరించని మతము అంతగా ప్రయోజనకారికాదు. అది ప్రత్యేకము కొందఱికి మాత్రము ఉపకరించు అల్పసిద్ధాంతము కానగును. 'మతము' అనునది నరునికి ఆతడెట్టి స్థితియందున్నను, స్వతంత్రుడయినను దాస్యమున నున్ననుకూడ చేయూతనీయగలదై సంసిద్ధమునై ఒప్పిననే మానవకోటి కుపకరించగలదు; నీచాతినీచ దశయందును, అత్యుత్తమ పవిత్రదశయందును ఉపకరించవలయును. ఎల్లెడలను అది వానికి చేయూతనొసగ జాలియుండవలయును. ఈ మహాధర్మమును నిర్వహించు శక్తిగలదైనప్పుడే దానిని వేదాంత మనుడు, ఆదర్శ మతమనుడు, మీ కిష్టమైన పేరునైన బిలువుడు, ఆధర్మము సార్థకము కాగలదు.

## ఆత్మ విశ్వాస మహిమ.

మనయందు మనకు విశ్వాసమునుఁగూర్చు ఆదర్శము మనకు అత్యంత ప్రయోజనకరము. మనము ఆత్మవిశ్వాసమును నేర్చి, విశేషముగ దానిని అనుష్ఠించియున్నచో మనమిప్పుడు అనుభవించు అనర్థములును దుఃఖములును రూపుమాసి యుండును. మానవచరిత్ర అంతటిని పరికించినచో, ఘనకార్యములను ఒనర్చిన స్త్రీపురుషుల జీవితములందు అన్నింటికంటెను హెచ్చుగ సామర్థ్యమును ఒసగిన మూలశక్తి వారియొక్క ఆత్మ విశ్వాసమే అని తెలియవచ్చును. తాము ఘనులమను

విశ్వాసముతో జననముగాంచి, ఘనులైరి. ఒకనరుడు అధ మాధమస్థితికి పడిపోయెననుకొనుడు; అట్లు కేవలము! నిరాశా హతుడయిన దశనుండియే అతడు ఊర్ధ్వగమనము సాగించి, ఆత్మ విశ్వాసమును నేర్చుకాలము ఆసన్నమై తీరవలయును. అయినను ప్రథమమునుండియు మనము దానిని గురించి యుండుట శ్రేయము. ఆత్మ విశ్వాసమును కుదుర్చుకొనుటకై ఇన్నికడగండ్లు పడనేల? ఒక నరునికి మఱొక నరునికి గల వ్యత్యాసమంతయు, ఆత్మవిశ్వాసముండుట ఆత్మవిశ్వాసము లేకపోవుట అను భేదమువలన కలుగుచుండెనని మనము సులభ ముగ గ్రహించగలము. ఆత్మవిశ్వాసము సర్వమును సాధించ గలదు. నాజీవితములో నాకది అనుభవమునకు వచ్చినది; ఇంకను అనుభవించుచున్నాను; నేను పెద్దవాడనయినకొలదిని ఈ విశ్వాసము బలమగుచున్నది. ఆత్మ విశ్వాసము లేనివాడు నాస్తికుడే. భగవంతుడొకడు కలడను నమ్మకములేనివాడు నాస్తికుడని పూర్వ మతములు బోధించినవి. తనయందు తనకు నమ్మకములేనివాడు నాస్తికుడని ఆధునికమతము బోధిం చుచున్నది. కాని ఇది స్వార్థపరమగు విశ్వాసముగాదు; ఏల యందురా, వేదాంతము అద్వైతమును బోధించును; సర్వ మును నీవే గనుక, సర్వమునందును విశ్వాసము కలిగియుండు టయే ఆత్మ విశ్వాసము అని యర్థము; సర్వమును నీవే గనుక, నీయందు నీకు ప్రేమయుండుట యనగా సర్వమును ప్రేమించు టయగును, పశువులయెడ ప్రేమ! ప్రతిదానియెడను ప్రేమ యే! ఇట్టివిశ్వాసమే ప్రపంచమును ఉద్ధరించగలదు; నాకు నిశ్చయమే. "నన్ను నేను బూర్తిగ దెలిసికొంటిని" అనగల వాడే సత్యమగు పురుషసింహుడు; నీశరీరమునందు ఎన్నిశక్తులు

ఎన్ని సమర్థతలు, ఎన్ని మహిమలు అణగియున్నవో యెఱుగుదువా? నరునందు అణగియున్న మహిమలను సర్వమును ఎఱింగిన శాస్త్రవేత్త యెవడుగలడు? నరుడు ఈలోకమున అవతరించి కోట్లవత్సరములు గడచినవి; అయినను వాని శక్తులలో అణుమాత్రమైనను ప్రకాశమునకు వచ్చియుండ లేదు. కావున మనము దుర్బలురమనుకొన తగదు. పయి పయిన కాన్పించు హీనతకు అడుగున మఱుగుపడి యెంత అవకాశములున్నవో మనకెట్లు దెలియును? నీలోపల అణగియున్న మహిమంగూర్చి నీకుఁ దెలిసినది అత్యల్పము! నీయందు మఱుగుపడి అనంతశక్తి, అనంత మహిమ పఱుగుచున్నది.

'ఈయాత్మనుఁగూర్చి ప్రప్రథమమున వినగావలయును.' నీవు ఆత్మఅను వాక్యమును దివారాత్రము ఆలకించుచుండుము. అది నీరక్తనాళములోనికి చొచ్చి, ప్రతిరక్తబిందువునందును ఇంకి నీఅస్థిమాంసములందు నిండువఱకును రేయింబవళ్ళు పఠింపుచుండుము. "జననమరణ రహితమై, దివ్యమై, సర్వజ్ఞమై, సర్వశక్తిసమన్వితమై, వెలుంగు ఆత్మను నేను" అను ఆదర్శముతో నీ తనువెల్ల నిండి నిబిడీకృతమగుగాక. రేయింబవళ్ళు దానినే మననము చేయుము. అది నీప్రాణముతో ఐక్యమైపోవువఱకును మననము చేయుము. దానినే సదా ధ్యానము చేయుము. అందుండి కర్మశక్తి బయలుదేఱగలదు! "హృదయస్ఫూర్తినుండి జిహ్వ మాటలాడును" అను సామెతగలదు. "హృదయము నిండినప్పుడు హస్తముగూడ పనిచేయును. కర్మ బయలుదేఱును. ఆదర్శముతోడ నిండియుండును; మీ రేమి చేసినను దీనిని చక్కఁగ సంస్మరింపుడు. అట్టి స్మరణవలన

మీచైదములన్నియు విస్మృతిగాంచును, రూపాంతరముపొందును. మహిమాఢ్యములగును. జడపదార్థము శక్తిగలదే, కాని భావము సర్వశక్తి సమన్వితము! ఈనిశ్వాసముతోడ మీజీవితముల నడపుడు; మీ సర్వశక్తి, మీ ఘనత, మీ మహిమల యొక్క స్మరణతో నిండియుండుడు. ఏమూఢ విశ్వాసములును దైవానుగ్రహమువలన మీతలలో దూరముండుగాక. చైతన్యమును హరించి క్షుద్రత్వ దుర్బలత్వభావములును మఱియు నిట్టి యితర మూఢవిశ్వాసములును మనసు జన్మమాదిగ నావరించియుండకుండ భగవంతుడు కృపజూచుగాక. మహోన్నతములును మహిమాఢ్యములును అగు ఈ రహస్యములను తెలిసికొనుటకు సులభమార్గములను ఈశ్వరుడు మానవజాతికి అనుగ్రహించుగాక. కాని నరుడీ అవస్థలను అన్నింటిని దాటవలసియున్నది. మీతరువాత రానున్న సంతతివారికి మార్గము ఇంకను కష్టతరముగ నొనర్పకుడు.

## సత్యబోధయందు ధైర్యము.

ఒక్కొక్కప్పుడు ఈ ధర్మముల బోధించుట భయంకరముగ దోచును. ఈ భావముల వినిన భీతిలిపోవు జనులను నే నెఱుగుదును. కాని అనుష్ఠాననిగతి గలవారు నేర్చుకొనవలసిన మొదటి విషయమే యిది. మీరు దుర్బలురమని యెన్నడును తలంపకుడు. ఇతరులకు ఎన్నడును అటుల బోధింపకుడు. చేతనైనచో ఉపకారముచేయుడు. అంతియగాని లోకమునకు హాని చేకూర్పకుడు. క్షుద్రులమనుకొని అభూతకల్పనలచేసికొని ఆ యీ దేవతల మ్రోల ప్రార్థనలు గావించుట, విలపించుట, అను సంకుచితభావములన్నియు మూఢత్వజనక

ములనీ మీ హృదంతరాళములందు మీ రెరిగియేయున్నారు. ఇట్టి ప్రార్థనలు ఫలించినట్టి ఒక్క దృష్టాంతమును జూపుడు. అట్టి ఫలసిద్ధి అంతయు మీ హృదయమునుండియే వెలువడు చున్నది సుడీ! దయ్యాలు లేవని మీ రెఱుగుదురు. కాని మీరు చీకటిలోనికిబోయినతోడనే శరీరము గగుర్పొడుచును. బాల్యమునం దిట్టి భీతిహేతువులగు భావములు మన బుద్ధుల లోనికి జొప్పింపఁబడి యుండుటే దానికిఁ కారణము. సంఘము నకు వెఱచిగాని, లోకమునకు వెఱచిగాని, స్నేహితులు ద్వేషింతురనిగాని, పూర్వాచారముగావచ్చుచున్న మూఢ విశ్వాసములు మాసిపోవునేమో అను భీతిచేగాని, యిట్టి భావములను మీరెవరికిని బోధింపకుడు. ఈ విషయములందు ధైర్యము వహించుడు. ప్రకృతియొక్క అభిన్నతయు, ఆత్మ విశ్వాసమును మించి బోధించుటకు మతమునందు ఏమున్నది? వేలకొలది వత్సరములనుండి మానవకోటి సలుపు కార్యములు అన్నియు ఈ గమ్యమును చేరుకొఱకే; మానవజాతి ఇంకను అందుకే పాటుబడుచున్నది. ఇప్పుడు మీవంతు వచ్చినది; మీకు రహస్యము తెలిసియున్నది. ఎల్లెడలను ఇదిబోధింపఁబడు చునే యున్నది. తత్వశాస్త్ర మనసేల, మనశ్శాస్త్రమును పదా ర్థశాస్త్రములు సయితము ఈగమ్యమునే చూపుచున్నవి. సర్వజగమును ఏకము అను రహస్యమును అంగీకరించుటకు జంకు శాస్త్రవేత్త నేడెక్కడ? భిన్నములగు భువనముల గొడవనెత్త సాహసించువాడేడి నేడు? అంతయు మూఢత్వము; ఉండునది ఒక్క ప్రాణమే; ఒక్క లోకమే; ఈ ఒక్క ప్రాణ మే, ఈ ఒక్క లోకమే మనకు బహుళముగా గోచరించు చున్నది. ఈ బాహుళ్యము స్వప్నప్రాయము, నీవు కలగను

నప్పుడు ఒక కలపోయి మఱొక కల వచ్చుచుండును, నీ స్వప్న ములందు నీవు జీవనముచేయుటలేదు. ఈకల లొకదాని వెంట నొకటి వచ్చుచుండును, ఒక రంగముపోయి వేఱొక రంగము సిద్ధమగుచుండును. నూటికి తొంబదిపాళ్ళు దుఃఖము పదిపాళ్ళు సుఖము అనుభవించు నీ ప్రపంచమున ఇట్లే జరుగుచుండును. ఒకవేళ కొంతకాలమైన పిమ్మట నూటికి తొంబదిపాళ్ళు సుఖ మున్నట్లు కన్పించవచ్చును. అప్పుడు దానిని స్వర్గమందుము. కాని జ్ఞానికి సర్వమును అదృశ్యమై, ఈజగమే ఈశ్వరుఁడు గను, తన యాత్మయే ఆ ఈశ్వరుఁడుగను, చూపట్టు కాలము వచ్చును. కాఁబట్టి జీవములు అనేకములులేవు. లోకము లును పెక్కులులేవు. ఆ ఒక్క ఆత్మయే యిట్లు బహుళ ముగాఁప్రకాశించుచున్నాఁడు. ఆ అద్వితీయుడే జడపదార్థ ము. ఆత్మ, మనస్సు, సంకల్పము, మఱియు సర్వమునై బహురూపములప్రకాశించుచున్నాడు. ఆ యేకోనారాయ ణుఁడే అనేకమై తోచుచున్నాఁడు. కాఁబట్టి యీ రహస్య మును మనము నేర్చుకొని యితరులకు నేర్పుటే ప్రథమ కర్తవ్యము.

లోకమంతయు ఈ ఆదర్శముతో ప్రతిధ్వనించుగాక. మూఢవిశ్వాసములన్నియు అదృశ్యమగుగాక! దుర్బలురము అనుకొను నరులకు ఇట్లు బోధింపుడు; వెంటనంటి బోధించు చుండుడు. "నీవు పరమపావనుఁడవు; మేల్కొనుము; లెమ్ము; ఓ మహాత్మా! నీకీనిద్ర తగదు. లెమ్ము; మేలుకొనుము; నీకిది అనుచితము. నీవు దుర్బలుడవనియు, దుఃఖితుడవనియు ఎంచ కుము. సర్వశక్తిసంపన్నా, లెమ్ము; మేల్కొంచుము! నీసహజ లక్షణమును ప్రకటింపుము. నీవు పాపినని భావించుకొనుట

యోగ్యముకాదు. నీవు దుర్బలుడ ననుకొనుట ఉచితముకాదు. ఈ భావమును ప్రపంచమునకు ప్రకటింపుము; నీలో నీవు సంస్మరింపుము, ఎట్టిఫలము సిద్ధించునో కనుగొనుము. సర్వమును ఎట్లు ప్రకాశవంతమగునో విద్యుద్వేగముతో సమస్తమును ఎట్లు రూపాంతరమును పొందునో చూడుము. మానవ కోటికి దీనిని బోధించుము, వారి మహిమను వారికి దెలుపుము. అప్పుడు దిన దినము మన సామాన్యజీవిత చర్యలందు దాని నెట్లు ప్రయోగింపగలమో తెలిసికొనగలుగుదుము.

వివేకమును దానినిఁ ప్రయోగించ గల్గుటకు, మన జీవితములందు అనుక్షణమును మన చేతలందన్నింటను, ఏది యోగ్యమో యేది అయోగ్యమో, ఏది సత్యమో యేది అసత్యమో విచక్షణచేయఁగల్గుటకు; పవిత్రత, యేకత్వము అను సత్య లక్షణములను మనము తెలిసికొని యుండవలయును. ఏకత్వమును సిద్ధింపఁజేయు సర్వమును సత్యము; ప్రేమ సత్యము; ద్వేషము అసత్యము; ఏలయన ద్వేషము భిన్నత్వమును కల్పించుచున్నది. నరుని నరుని విడదీయునది ద్వేషము; కావున అది అయోగ్యము, అసత్యము. అది విచ్ఛేదనశక్తి; భిన్నముచేసి నాశమును కూర్చును.

ప్రేమ కలయికనుగూర్చును; అనగా ఏకత్వమును సమకూర్చును. మీరందఱు ఒక్కలై మారుదురు. తల్లి బిడ్డతోడను, కుటుంబములు నగరముతోడను, ప్రపంచమంతయు జీవజంతువులతోడను ఐక్యముగాంచును. ప్రేమయే అస్తిత్వము, ప్రేమ భగవంతుఁడే. సర్వమును ఆ ఏకైక ప్రేమ రాశి యొక్క రూపాంతరమే; దాని ప్రకాశమున హెచ్చుతగ్గులు చూపట్టుచున్నవి. అందుగల అంతరము వ్యత్యాసము చేతనే భేదములు

కాన్పించుట. కాని సర్వము ఆ ప్రేమరాశియొక్క రూపాంతర మేసుడీ! కాబట్టి మనచేతలందు భిన్నత్వము కల్పితమగు చున్నదా, యేకత్వము చేకూరుచున్నదాయని సతతము విచా రించవలయును. వానివలన భిన్నత్వ మేర్పడుచున్నయెడల వానిని పరిత్యజించవలయును. ఏకత్వము సిద్ధించుచో అవి యోగ్యములని స్వీకరించవలయును. అట్లే మన తలపులందును వర్తించవలయును. వానివలన విచ్ఛిన్నత అనేకత్వము చేకూరు చుండెనా, లేక ఆత్మను ఆత్మను బంధించుచు అద్వైతము సిద్ధిం చుచుండెనా అని అరయగావలెను. ఏకత్వము సిద్ధించినయెడల మనము వానిని స్వీకరించవలెను, లేదా దోష భూయిష్టము లని వానిని పరిత్యజించవలయును.

## సర్వాత్మ రూపము

నీతి శాస్త్రోద్దేశ్యము, తెలియరాని దేనినో నమ్మ కొనుటగాదు; అజ్ఞేయమగు దేనిని గూర్చియో బోధించుట కాదు; ఉపనిషత్తులు ఉద్ఘోషించునటులు "అజ్ఞేయబ్రహ్మముగా మనము పూజించు దేవునిగూర్చి వివరముగ బోధించుటే!" ఆత్మ ద్వారమున మాత్రమే నేను దేనినైన గ్రహించ గలు దును. నేను కురిచీని కాంచుచున్నాను కాని నేను ఆ కురిచీని గుర్తించుటకు మొట్ట మొదట నన్ను నేను గుర్తించవలయును; ఆపిమ్మట నేను దానిని గుర్తించవలయును. ఆకురిచీ ఆత్మ ద్వారమున, ఆ ఆత్మలోపలనే చూడబడుచున్నది. ఆత్మ ద్వార మున, ఆత్మలోనే మిమ్మును నేను చూడ గల్గుచున్నాను. లోకను నంతను గూడ చూడ గల్గుచున్నాను. కావున ఇట్టి ఆత్మను అజ్ఞేయమనుట వెఱ్ఱిమాట. ఈ ఆత్మను తొలగించుము. జగమంతయు అస్పష్టమే యగును. ఈ ఆత్మద్వారముననే,

ఈ ఆత్మలోనే సమస్త జ్ఞానమును సంభవముకాగలుగుచున్నది. కాబట్టి ఆత్మయే అన్నిటికంటె మిన్నగ తెలియ వచ్చునది. "నేను" అని మీరనునది ఆ ఆత్మనే, మీరు ఆ ఆత్మయే "నేను" అని నేను జెనిని అనుచున్నాడనో, అదియే "నేను" అని మీరును అనుకొనునదియు ఎట్లుకాఁగలదని వింతకలుగ వచ్చును. సంకుచిత భావముతో "నేను" అనుకొనునదియే పరిమితిలేని అఖండాత్మ ఎట్లు కాఁగలదని మీరాశ్చర్యపడ వచ్చును. కాని అట్లగుట సత్యము. పరిమితంబై కానంబడున దెల్ల బూటకము. అఖండమగు ఆత్మ కప్పబడినట్లుకాగా దాని లోని స్వల్పాంశము "నేను"గాఁ బ్రకటితమగుచున్నది. అఖండ మగునది నిజముగా పరిమితికి లోఁబడజాలదు, అట్లగుట బూట కము. కావున మనందఱకును స్త్రీగాని, పురుషుడుగాని, శిశువు గాని, తుదకు పశువుగాని అందఱకునుఆత్మ తెలియ వచ్చుచునే యున్నది. ఆత్మను ఎఱుఁగకుండ మనము జీవించజాలము. చరించజాలము, పలువజాలము, ఈసర్వేశ్వరుని ఎఱుంగకుండ మనము శ్వాసించజాలము. ఒక్కనిమిషకాలము బ్రతుక జాలము. వేదాంతముబోధించు దేవుడు అన్నిటికంటె నెక్కుగ దెలియ వచ్చుచునే యున్నాడు. కేవలము ఊహా కల్పితుఁడు కాడు. అది అనుష్ఠాన యోగ్యమగు భగవద్బోధ కానిచో, ఇంకెట్లు అనుష్ఠానయోగ్యముగా భగవంతుని గూర్చి బోధిం చుట? నేను నా యెదుట కాంచఁగల్గినట్టి భగవంతునికంటె, సమస్తమునందు నిండి సర్వాంతర్యామియై వఱలు దేవునికంటె మన యింద్రియములకన్నను సత్యమై చూపట్టు దైవముకంటెఁ బ్రత్యక్షముగ మనము తెలిసికొనగల ఈశ్వరుడు ఇంకెవడుండ గలడు? సర్వశక్తిసంపన్నుఁడై సర్వత్ర వెలుంగుచు, ఆత్మల

కెల్ల ఆత్మయైవఱలు ఆభగవంతుఁడు నీవే! నీవు కావనిఅంటి నేని నేను అబద్ధముపలికిన వాడనే అగుదును. సర్వకాల సర్వావస్థలయందును నేను గుర్తించినను లేకున్నను, నేను వానిని ఎఱుంగుదును. ఆతడు ఏకైకమూర్తి, అన్నిటగల ఏకత్వము, సర్వజీవలోకమునందును వెలుగు సత్యత్వము, అస్తిత్వమునం దెల్లగల సత్యము!

## ఆదర్శ పరిణామము

వేదాంతము బోధించు ఈ నీతిశాస్త్ర భావములను ఇంకను విశదీకరించవలసియున్నది. కావున కొంత ఓపిక పట్టుడు. నేను చెప్పియున్నటుల ఈ విషయమున వివరములను పరిశీలించవలసియున్నది. కడు క్షుద్రాదర్శములనుండి యీ భావములు ఎట్లు ఉద్భవించినవో, ఈ అద్వైతాదర్శము ఎట్లు పరిణామముగాంచినదో, ఎట్లు సర్వప్రేమగ సిద్ధరూపము దాల్చినదో తెలియుట దానిని పూర్తిగ విమర్శించుచు నిరూపణము గావించవలసియున్నది. అపాయములను తప్పించుకొను కొఱకు దీనిని క్షుణ్ణముగఁ తెలిసికొనవలయును. అతిక్షుద్రదశలనుండి దీనిని అవలోకనచేసికొనుచు వచ్చుటకు లోకులకు ఓపిక లేకున్నది. కాని ముందు రానున్నవారికి ఈ రహస్యమును అందీయజాలమేని మనము పైమెట్టుల నిలిచిన లాభమేముండగలదు? కాఁబట్టి కూలంకషముగ దీనిని పరిశీలించుట యుక్తము. బుద్ధిబలము తుదను నిష్ప్రయోజనమని మెఱిగియున్నను, బుద్ధి సాధ్యమగునంతవఱకు విషయమును ముమ్ముందుగావివరించుట అవసరము. కానిహృదయమేఅన్నింట ప్రధానమైనది! ఈశ్వరుని మనము జూడగలది హృదయద్వారమునగాని బుద్ధిద్వారమున కాదుసుడీ! బుద్ధి ఊడ్చు

కత్తెవంటిది. మార్గము సరిచేయగలదు. పోలీసువానివలె అప్రధానమైనది. సంఘవర్తనమున పోలీసువాడు ఉండితీరవలయునను అవసరములేదు. ఆతడల్లరులను మాత్రము ఆపవలసినవాడు. దుర్వర్తనమును మాత్రము అరికట్టవలసినవాడు. బుద్ధి చేయవలసినపనియు ఇంతమాత్రమే. కేవలము బుద్ధిచాకచక్యమును ప్రకటించు పుస్తకములను మీరు చదివినప్పుడు వానిని చక్కగ పఠించిననెనుక "హా! దైవమా, బయటపడితిని బాబూ!" అందురు. ఏల? బుద్ధి గ్రుడ్డిది. స్వయముగా చరింపజాలనిది. దానికి కాలుసేతులును లేవు. పనిచేయగలది భావనయే. ఇది విద్యుచ్ఛక్తికంటెను, మఱి దేనికంటెను అమితవేగముగా చరించగలదు. నీకు భావనాశక్తిగలదా అనునదే ప్రధానవిషయము. అది యున్నదా నీవు ఈశ్వరుని దర్శించగలవు. నీ కిప్పుడు గల భావనాశక్తియే సాంద్రమై, దివ్యమై, సమస్తమును స్పర్శించి సమస్తమునందును ఐక్యభావమునంది, తనలోను అన్యమునందును గూడ భగవంతుని గుర్తింపజాలు వఱకును క్రమోన్నతిని పొందగలదు. బుద్ధియెన్నడును అటుల జేయజాలదు. "శబ్దములను వివిధగతులతో ఉచ్చరించుట, శాస్త్రములకు పలురీతుల వ్యాఖ్యానముచేయుట చదువరుల ఆనందముకొఱకే గాని, అది ఆత్మముక్తిసాధన కాజాలదు."

మీలో "తామసేకెంపిస్" గారి గ్రంథము చదివినవారికి ప్రతిపుటయందును ఆయన ఈ విషయమును ఎట్లు నొక్కి చెప్పెనో తెలిసియుండును. లోకములో ప్రతిజ్ఞానియు ఈవిషయమును వక్కాణించియే యున్నాడు అన దగును. బుద్ధిబలమును అవసరమేసుడీ! అదిలేనిచో మనము పిచ్చి

పోకడల పోదుము; నానా విధములగు పొఱబాటులకును లోఁబడుదుము. బుద్ధి దీనిని అరి కట్టగలదు. కాని అంతకు మించి బుద్ధిపైన ఆధారపడి దేనిని నిర్మాణముఁచేయ యత్నింప దగదు. బుద్ధి స్థాణువగు అప్రధానమగు సాధన. సత్యమగు సాహాయ్యము భావనవలన అనగా ప్రేమవలన రాఁగలదు. ఇతరులయెడ నీకు సానుభూతి గలదా? అట్లైనచో నీవు ఏకత్వ మున మెలగుచున్నట్లే. నీకుఇతరులపై సానుభూతిలేదా, యీజగ మున జననము గాంచిన మేధావులలో నెల్లను అగ్రగణ్యుడ వైనను సహా,నీవు వ్యర్థుడవే అగుదువు. నీదిసారహీనమగుబుద్ధి, నిర్జీవమగు మేధస్సు; నీవు అటుల నిలచి పోవలసినవాడవే. అటులఁగాక నీకు సానుభూతి గలదేని, నీవు ఏగ్రంథమును పఠింపజాలకున్నను, ఏభాషను ఎరుగకున్ననుఁగూడ నీవు సరి యైన త్రోవలోనున్న వాడవే అగుదువు. ఈశ్వరుడు నీవాడై యుండును. ప్రపంచ చరిత్రనుఁ పఠించుచో, ప్రవక్తలగువారి మహిమ యెందుండునో గ్రహించితిరా? అదెందున్నది? మెదడు నందున్నదా? వారిలో ఎవ్వరైనను తత్వశాస్త్రములగూర్చిగాని తర్కశాస్త్ర క్లిష్టసమస్యలంగూర్చిగాని ఒక్క గ్రంథమునైనను ఎన్నడేని వ్రాసియుండిరా? ఒక్కడును అటుల చేసియుండ లేదు. వారు మితముగా వచించెడివారు. క్రీస్తువలె సాను తాపము పూనుము. నీవు క్రీస్తువగుదువు, బుద్ధునివలె సాను క్రోశముతాల్చుము, నీవుబుద్ధుడవగుదువు. సానుభూతియే వారి జీవితరహస్యము,వారిబలము,వారిమహిమ.అదిలేనినాడు మేధా శక్తి యెంతయున్నను భగవంతునింపొందుట సున్న. మేధస్సు చలన శక్తిలేని అవయవము వంటిది. సానుతాపము సర్వా వయవములందును ఆవేశించి, ఉద్ఘాతలాడించి నప్పుడే, అవి

చలించి యితరులపై పని చేయగలవు. ప్రపంచమున ఎల్లెడలను ఇట్లే జరుగును. ఈవిషయమునుమీరు సదా జ్ఞప్తినుంచుకొన వలయును. వేదాంతము బోధించునీతిశాస్త్రమునందు మిక్కిలిగ అనుష్ఠానయోగ్యమగు విషయమే ఇది. మీరందఱును ప్రవక్తలే యనియు, ప్రవక్తలై తీరవలయుననియు వేదాంతము బోధించు చున్నది. నీవు వ్రాయుపుస్తకము ఏదియు నీవర్తనకు నిదర్శనము కాజాలదు; నీశీలమే నీపుస్తకమునకుదృష్టాంతముగానిలుపవలయును. ఏ పుస్తకముగాని సత్యమును బోధించుచున్నది అని నీవెట్లు నిర్ణయింపగలవు? నీవే ఆ సత్యమై దానిని అనుభవించగల్గుదువుగాననే! ఇదే వేదాంతబోధ. లోకమున క్రీస్తులకును బుద్ధులకును సాక్ష్యమేది? మీరును నేనును వారివలెసానుభూతిని పూనగలమనుటే! ఆవిధమునమాత్రమే మీరును నేనును వారు సత్యపురుషులని గ్రహింపగలుగుదుము. మనయందు గల ప్రవక్తృత్వమే ప్రవక్తలకు సాక్ష్యము. మీయందలి దైవత్వమే భగవంతుని రుజువుచేయునది. నీవు ప్రవక్తవేగానిచో, భగవంతునిగూర్చి యేదియు ఎన్నడును సత్యము కాజాలదు. నీవు దేవుడవుగానిచో దేవుడేలేడు; ఎన్నడు నుండజాలడు. మనము అనుష్ఠించదగు ఆదర్శము ఇదియే అని వేదాంతము బోధించుచున్నది. మనలో ప్రతివాడును ప్రవక్తగా మారవలసియున్నది; మీరిదివఱకే అట్టివారు సుడీ! దానిని తెలిసికొనవలసి మాత్రమున్నారు. ఆత్మకు అసాధ్యమగునది ఏదేని కలదని ఎన్నడును దలపకుడు. అట్లనుకొనుట గొప్ప స్వామిద్రోహము. పాపము అనునది ఏమేని ఉన్నయెడల మీరు దుర్బలురని, యితరులు దుర్బలురని పలుకుటే ఆ పాపము!

# అనుష్ఠానవేదాంతము

## ౨-వ భాగము.



ఒక బాలునకు జ్ఞానము లభించిన విధమునుఁ తెలుపు ప్రాచీనకథను, ఛాందోగ్యోపనిషత్తులోని దానిని మీకుఁ దెలిపెదను. ఆకథాస్వరూపము మిగుల విశ్రుతముగానుండునుగాని, దాని యందొక ధర్మసూత్రము కానగును. ఒకబాలుఁడు తల్లితో నిట్లనెను. "నేను వేదములఁ పఠింపఁబోవుచున్నాను. నాతండ్రి పేరేదియో నాకులమేదియో తెలుపుము." వాని తల్లి వివాహముచేసికొనిన స్త్రీకాదు. భారతదేశములో వివాహముగాని స్త్రీయొక్క బిడ్డడు జాతిభ్రష్టుఁడుగ నెంచబడును. సంఘము ఇటువంటివానిని స్వీకరించదు. అతడు వేదాధ్యయనమున కర్హుఁడుగాడు. కావున పాపమాబాలుని తల్లి "బిడ్డా! నీగోత్రమును నేనెఱుఁగను. నేను దాస్యవృత్తి చేయుచు, పెక్కుతావులఁ చరించితిని. నీతండ్రి యెవరో, నేనెఱుగను. కాని నాపేరు జాబాలి, నీపేరు సత్యకాముఁడు" అనెను. ఆబాలుఁడొక ఋషిని సమీపించి తనను శిష్యునిగా స్వీకరింపుడని వేడెను. ఆఋషి నీతండ్రి పేరేమి? నీకులమేమి;" అని ప్రశ్నించెను; బాలుఁడంత తన తల్లివలన వినినదానినిఁ తెల్పెను. వెంటనే ఋషి యిట్లనెను — "తననుగూర్చి ఇట్టి అప్రియమగు ఉదంతమును బ్రాహ్మణుడుతప్ప తదితరుడు పలుకలేడు. నీవు బ్రాహ్మణుండవు. నేను నీకు విద్యగఱపుదును. నీవు సత్యమును వదలలేదు." అంతట ఆయన బాలుని తన కడ నిలుపుకొని విద్యనేర్పెను.

ప్రాచీన భారతదేశమునందు విచిత్ర విద్యాపద్ధతులుండెడివి. గురువు సత్యకామునకు నాలుగు వందల ఆవులను చిక్కి బలహీనముగ నున్నవానిని ఒప్పగించి మేపుకొనిరమ్మని అడవికి బంపెను. అతడు అడవికింబోయి కొంతకాలము గడిపెను. ఆమంద వేయి అయినప్పుడు తిరిగిరమ్మని గురువు అతనికి చెప్పియున్నాఁడు. కొన్ని వత్సరములు గడచిన పిమ్మట, ఒక ఆబోతు రంకెవేసి యిట్లనుట సత్యకామునకు వినవచ్చినది. "ఇప్పుడు మేము వేయిఅయితిమి. మమ్ము మీగురువుకడకుఁగొని పొమ్ము. నేను నీకు ఒకింత బ్రహ్మోపదేశము చేసెద." "స్వామీ! సెలవిండ"ని బాలుఁడనెను. "తూర్పుదిశ బ్రహ్మము నందొకభాగము; అటులనే పడమటిదిశ; ఉత్తర దక్షిణ దిశలును అట్లే. ఈనాలుఁగుదిశాంతములును బ్రహ్మమున నాలుగు భాగములు. అగ్నియు నీకొకింత బ్రహ్మోపదేశము చేయును" అని ఆబోతనెను. ఆదినములలో అగ్ని ఒక గొప్ప దైవతము. ప్రతివిద్యార్థియు అగ్నిసిఁగూర్చుకొని హోమములు చేయవలసియుండెను. కావున మరుసటి దినమున సత్యకాముడు గురునింటికయి పయనముసాగించెను. సాయంతనమగుడు, అతడు శుచుడయి, అగ్నిని ఆరాధించి, దాపున కూర్చుండియుండ "ఓసత్యకామా!" యను పిలుపు అగ్ని మధ్యమునుండి వినవచ్చెను. "స్వామీ, సెలవిండు" అని సత్యకాముఁడు అనెను. (సమూయేలునకు విచిత్రవాణి వినవచ్చిన, బైబులులోని కథ ఇట్టిది మీకు జ్ఞప్తినుండవచ్చును.) "ఓసత్యకామా! నేను నీకు ఒకింత బ్రహ్మోపదేశముచేయవచ్చితిని. ఈపుడమి బ్రహ్మమునందు ఒకభాగము, ఆకాశమును స్వర్గమును బ్రహ్మమునందలి భాగములే. సముద్రమును వానిలోని

భాగమే.” ఇంక ఒకానొక పక్షియు వానినికి ఒకింత బోధించ గలదని అగ్ని చెప్పెను. సత్యకాముఁడు ప్రయాణము సాగించు చుండెను. ఒకనాడు సంజవేళ అతడు తర్పణాదులు కావించిన యనంతరము ఒక హంస వచ్చి యిట్లుపదేశించెను. „నేనును బ్రహ్మముంగూర్చి ఒకింత తెల్పెదను. నీవు ఆరాధించు అగ్ని బ్రహ్మమునందు ఒకభాగము. సూర్యుఁడు చంద్రుఁడు మెఱుపు బ్రహ్మమునందలి అంశములే. మద్గువను పక్షియు మరి కొంత ఉపదేశముచేయఁగలదు” మరునాటి సాయంతన ము ఆపక్షి వచ్చినది. వెనుకటిరీతి ధ్వనిగా సత్యకాము నకు వినవచ్చినది. “నేను ఒకింత బ్రహ్మోపదేశము చేసె దను, శ్వాస బ్రహ్మమునందు ఒకభాగము, దృష్టి ఒకభాగము, శ్రవణము ఒకభాగము, మనస్సు ఒకభాగము”. పిమ్మట ఆబా లుడు గురునిల్లుచేరి వినయ విధేయతలతో నమ్రుడై వాని మ్రోల నిలువబడెను. గురువు ఆశిష్యుని కాంచగానే “సత్య కామా! నీముఖము బ్రహ్మవిదుని ముఖమువలెఁ ప్రకాశించు చున్నది! నీకు ఎవ రుపదేశించిరి”ని అడిగెను. ‘నాకు ఇతరము లగు జంతువులు బోధించియున్నవి. స్వామీ! మీరును నాకు ఉపదేశము చేయగోరెదను. ఏలన, గురుముఖమున నేర్చిన జ్ఞానమే పరమార్థమును తెలుపఁగలదని మీవంటి పెద్దల వలన వింటిన”ని ఆబాలుఁడనెను. అంతట గురువు తాను దేవ తలవలన తెలిసిన జ్ఞానమును అతనికి ఉపదేశించి “ఇంక ఎంత మాత్రమును కొఱవడినదిలేదు’ అనెను.

ఆ ఆబోతు, అగ్ని, పక్షులు నేర్పిన చిత్రకథ అటుండ, పూర్వ కాలమున ఎట్టి భావనలుండెడివో ఆ దినములలో ఇవి యెట్లు ప్రసరించెడినో మనకుఁ తెలియఁ కలదు. ఈవాణి

సర్వమును అభ్యంతరముననే కలదను భావముయొక్క సూచన మనకు కాన వచ్చుచున్నది. ఈరహస్యములను మనము గ్రహించిన కొలదిని ఆదివ్యవాణి మన హృదంతరాళముననే కలదనియు, ఆ బ్రహ్మచారి ఆ సత్యమును సదా వినుచునే దానిని సరిగా గ్రహించలేక పోయెననియు గ్రహింపఁగలము. సదా తనలోనేయున్న ఆ వాణిని అతడు బాహ్య ప్రపంచము నుండి వచ్చుచున్నట్లు ఎంచెను. బ్రహ్మజ్ఞానమును అనుష్ఠాన యోగ్యముగ నొనర్పవలయును అనునది మనము తెలిసికొనఁ గల రెండవ రహస్యము. మతమును అనుష్ఠానయోగ్యముగ నొనరించు సదుపాయములకై లోకము ఎదురు చూచుచున్నది. ఈకథలవలన అది దినదినము ఎట్లుఅనుష్ఠానము లోనికివచ్చుచుం డెనో గ్రహింపఁగలము. విద్యార్థికి పరిచయములగు ప్రతిదాని ద్వారముననుు తత్వరహస్యము తెలుపఁబడినది. వారారాధించు చుండిన యగ్ని బ్రహ్మము, భూమిబ్రహ్మమే; ఇట్లే యన్నియు!

ఈ సత్యకామునియొద్దకు విద్యార్థియై వెళ్ళి, వాని తోడ కొంతకాలముండిన ఉపకోసల కమలాయనుని గూర్చి ఒక కథగలదు. ఒకపరి సత్యకాముఁడు యాత్రకు వెళ్ళగా ఈ విద్యార్థి దిగులుజెందిన వాడయ్యెను. అప్పుడు గురుభార్య వచ్చి నీవేల సరిగ భోజనము చేయకుంటివని అడుగ, ఆ బాలుఁడు «నాకు ఆనందములేదు, భుజించుటకు మనస్కరించుట లేద» నెను. అప్పుడాతడుఆరాధించుచున్న అగ్నినుండి "ప్రాణము బ్రహ్మము, ఆకాశము బ్రహ్మము, ఆనందము బ్రహ్మము. ఆ బ్రహ్మమును తెలిసికొనుము" అనుధ్వని వెలువడినది. అంత ఆ బాలుఁడు "స్వామీ, ప్రాణము బ్రహ్మమని యెరుగుదును, ఆకాశము బ్రహ్మమని తెలియును. కాని ఆనందమును నేను

కనుఁగొనలేకున్నాను” అనెను. అప్పుడా వాని “ఆకాశమును ఆనందమును సత్యముగ ఒక్కటే” అనెను. అనఁగా అది హృదయాంతరాళమునఁ గల జ్ఞానాకాశమే అని వివరించి చెప్పినది. ఇట్లు బ్రహ్మము ప్రాణమనియు, అదే హృదయము నందలి ఆకాశమనియు వానికి బోధింపబడినది. అగ్ని వాని కింకను ఇట్లుపదేశించినది. “ఈ పృథ్వి ఈ అన్నము నీవారా ధించు అగ్ని సూర్యుఁడు అన్నియు బ్రహ్మస్వరూపములే. సూర్యునియందు సాక్షియైవఱలువాడను నేనే. “శివోహం” దీని నెఱింగి సూర్యుని ధ్యానించువాని పాపములు నశింపఁ గలవు. అతడు దీర్ఘాయుష్మంతుఁడై ఆనందమును అనుభవించ గలడు. దిక్కులందు అధివసించువాడను నేనే. చంద్రుఁడు; నక్షత్రములు, ఉదకమును నేనే. ప్రాణమునందున్నవాడను ఆకాశమునందును, జ్యోతిర్మండలమునందును, విద్యుల్లతయం దును ప్రకాశించువాడను నేనే. “శివోహం” ఇక్కడగూడ అనుష్ఠానార్హమగు మతమును గురించిన పూర్వపు భావమే ప్రాప్తించుచున్నది. వారు ఆరాధించుచుండిన అగ్ని, సూర్యుఁడు చంద్రుఁడు, మొదలగు వస్తువులును, వారికి పరిచితమైయున్న వాణియు, ఎట్టివో వివరించి వాని అంతరార్థమును ప్రకటిం చుటే ఈ కథాంశము. అయ్యదియే వేదాంతముయొక్క సత్య మును అనుష్ఠానయోగ్యమును అగు స్వరూపము. ఇది జగ త్తును నిర్మూలము గావించుటలేదు. దాని నిజతత్వమును బోధించుచున్నది; ఇది పురుషునికి నాశము కూర్చుటలేదు. వాని రహస్యమును తెల్లముచేయుచున్నది; ఇది వ్యక్తిత్వమును నశింపచేయుట లేదు. ఆవ్యక్తిత్వముయొక్క సత్యస్వరూప మునే వ్యక్తముచేయుచున్నది. ఈ ప్రపంచము వ్యర్థమైనది.

కేవలము మిథ్యఅనుటలేదు. "ఈ ప్రపంచతత్వమును తెలిసికొనుము, అప్పుడది నిన్ను భంగపఱుపఁజాలదు" అని బోధించుచున్నది. అల దివ్యవాణి సత్యకామునికి అతడారాధించు అగ్ని సూర్యుఁడు చంద్రుఁడు, విద్యుల్లత మొదలగునవి ఏవియు అయోగ్యములని తెలుపలేదు; అందుకుమారుగా ఆఅగ్ని సూర్యుఁడు చంద్రుఁడు, విద్యుల్లత, పృథ్వి మున్నగు వానియందు అధివసించు ఆత్మయే అతనియందును ఉండెనని బోధించినది. అందువలన సత్యకాముని దృష్టిలో అవిఅన్నియు రూపాంతరము పొందినట్లయ్యెను. అతడు ఆహుతుల నిడుచుండిన అగ్నియొక్క స్థూలాకారము పోయి, నూతన స్వరూపము చేకూఱగా అది బ్రహ్మమేఐనది. ఇట్లే పుడమి రూపాంతరము చెందినది. ప్రాణము, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, విద్యుల్లత మొదలగు వాని రూపములన్నియు మారిపోయి దివ్యత్వమును పొందినవి. సత్యస్వభావము వెల్లడియైనది, సర్వము నందును బ్రహ్మమును దర్శించుచు, ఆయావస్తువుల బాహ్యస్వరూపమును దాటి, వాని సత్యస్వరూపమును కాంచుటే వేదాంతాదర్శనము.

ఉపనిషత్తులలో ఇంకొకపాఠము నేర్పఁబడుచున్నది. "నేత్రముల ద్వారమున ప్రకాశించునది బ్రహ్మము. అతడు మనోహరుడు. అతడే తేజస్వి. అతడే జగములన్నింటను వెలుంగుచున్నాడు." నేత్రములందలి ప్రకాశము అనగా పవిత్రాత్మునికి లభించు ఒకవిధమైన విచిత్ర తేజస్సనియు నరుఁడు పవిత్రుఁడైనప్పుడు అటువంటి తేజము వానినేత్రములందు నెలకొనుననియు, నిజమునకు అది వాని ఆత్మ తేజస్సనియు, అది సర్వ వ్యాప్తమనియు వ్యాఖ్యానకర్త తెలుపుచున్నాడు. ఆ

తేజమే గ్రహము లందును, నక్షత్రములందును సూర్యులందును ప్రకాశించు చున్నది.

ఇక జననము మరణము మున్నగు వానిం గూర్చి యీ ప్రాచీనోపనిషత్తుల ఉపదేశములను తెలిపెదను. మీకు అవి హృద్యములుగ నుండనోపు. శ్వేతకేతుండు పాంచాలాధీశుని యొద్ద కేగినాండు. ఆరాజు "నరులు చచ్చునప్పుడు వారెట కేగుదురో తెలియునా? వారెట్లుం దిరిగివత్తురో యెఱుంగుదువా? పరలోకము ఎన్నడును నిండిపోకుండుటకు కారణము గ్రాహ్యమైనదా.' అని ప్రశ్నించినాడు. బాలుండు తెలియదని చెప్పి, తన తండ్రికడకుంబోయి ఆప్రశ్నలను అడిగినాండు. తండ్రియు తెలియదనగా వారిరువురునుం గలిసి రాజుకడకేగిరి. ఈ జ్ఞానము విప్రులకు లేదనియు, అది రాజులకడనే కలదనియు, అందుచేతనే రాజులు ప్రపంచమునుం బాలించుచుండిరనియు ఆరాజు చెప్పెను. ఈయన ఆరాజునుం గొంతకాలము సేవించిన అనంతరము ఆరాజిట్టుల బోధించెను. "ఓగౌతమా, పరలోకమే అగ్ని; సూర్యుడు అందలి యింధనచయము; కిరణములే పొగ; దివమే దానిజ్వాల; చంద్రుండు అందలి కొఱకచ్చు; నక్షత్రములు విస్ఫులింగములు; ఈ అగ్నిలో దేవతలిడెడు ఆహుతి సోమభక్తి. ఆ ఆహుతినుండి సోమప్రభుండు ఆవిర్భవించుచున్నాండు." ఇట్లుపదేశించుచుం బోయెను. "అల్పాగ్నిలో హోమము చేయనక్కఱలేదు. ఈ జగమంతయు అగ్నియే. ఈ హోమము, ఈ ఆరాధన నిరంతరముం జరుగుచునే యున్నది. దేవతలు, దేవదూతలు అందఱును దానిని ఆరాధించుచునే యున్నారు. నరుండు ఆ అగ్నియొక్క విగ్రహమే; నరుని శరీరమేఅది." ఇందుగూడ ఆదర్శము అనుష్ఠాన

యోగ్యమై యొప్పుచున్నది. బ్రహ్మను సర్వమునందును చూపట్టుచున్నాడు. కల్పితవిగ్రహములు మంచివే కావచ్చును; సహకారములే; కాని మనము కల్పింపగలవానిని అన్నింటిని మించిన శ్రేష్ఠతమ విగ్రహములు ఇదివఱకే యున్నవి. ఈశ్వరారాధనకై నీవు ఒకవిగ్రహమును రచింప వచ్చును; గాని సజీవుడైన పురుషుని ఆకారమున శ్రేష్ఠతరమగు విగ్రహము ఉండియే యున్నది. నీవు దేవతా ప్రతిష్ఠకై ఒక దేవాలయమును నిర్మింపవచ్చును; కాని నరునిశరీరమను ఉత్తమతర దేవళము ఉండియే యున్నది గదా.

వేదములందు రెండుభాగములు కలవని మీరెఱింగి యుండవోపును; కర్మభాగము, జ్ఞానభాగము. రాను రాను కర్మలు పెచ్చు పెరిగిపోయి వానిని వివరముగా తెలిసికొనుటకు అసాధ్యమగునంతటి చిక్కులు ఏర్పడినవి. ఉపనిషత్తులందు ఈకర్మలు విసర్జింపఁబడుటఁ కాంచగలము. కాని నెమ్మదిగను, సూక్ష్మరహస్యముల విశదీకరించుచును అటుల గావింపఁబడినది. పూర్వకాలమున ఈ హోమములు యజ్ఞములు చాలనుండెడివి. తత్వజ్ఞులు బయలుదేరి పామరుల చేతి నుండి విగ్రహములను బలాత్కారముగా లాగివేయుటకు మారుగా, ఈకాలపు సంస్కరణములందు మనము అన్యాయముగా పూనుకొనునట్లు వ్యతికర ప్రణాళికను పూనుటకు మారుగా, పూర్వపు దానిస్థానమున కొత్తదానిని నెమ్మదిగ ప్రవేశపెట్టినారు. వారిట్లు బోధించిరి. "అగ్నియొక్క ప్రతిమ కలదుగదా, మంచిది! ఇదిగో భూమి, ఇదొక విగ్రహము. ఎంత ఘనతర ప్రతిమయో చూడుడు! ఈచిన్న దేవాలయము కలదు గదా, అదిగో జగత్తంతయు దేవళమే! నరుడువెల్లెడల పూజల

సలుపనగును. నేలమీద మానవులు వేఱువేఱు యంత్రముల గీయుచు వేదికల రచింత్రుగదా. ఇదిగో మహత్తరమగు వేదిక సచేతనమగు మానవశరీరము! జడములగు విగ్రహములను ఆరాధించుటకంటె ఈ వేదికచెంత పూజలను అర్పించుట ఉత్తమోత్తమము.''

ఇప్పుడొక విచిత్రసిద్ధాంతమును తెలిపెద. దానిని నేనే అంతగా గ్రహింపఁ జాల కుంటిని. మీకేమైన అర్థమగు నేమో చూడుడు. వినుడు. తపస్సుచే పునీతుఁడై జ్ఞానమును పొందిన నరుఁడు మరణించునప్పుడు అతడు మొట్ట మొదట తేజస్సునందుఁ ప్రవేశించును; తేజస్సునుండి దివమునను, దివమునుండి శుక్లపక్షమందును. అందుండి ఉత్తరాయణమునను; అందుండి సంవత్సరమునందును, సంవత్సరమునందుండి సూర్యునియందు, సూర్యునికడనుండి చంద్రునిలోను, చంద్రునియందుండి విద్యుల్లేఖయందును ప్రవేశించును. విద్యుల్లేఖయందుండగా అతని కొక అతీత మానుషస్వరూపుఁడు దర్శనమిచ్చి వానిని అవ్యయబ్రహ్మమునఁజేర్చును. ఇది దేవయానము. ఋషులును జ్ఞానులును మరణించు నప్పుడు వారీమార్గమున పోదురు. తిరిగి రారు. ఈ సంవత్సరమననేమో నెలయననేమో ఈసంగతులను ఎవడును స్పష్టముగ గ్రహింపజాలకున్నాడు. ఎవరికివారు వేఱువేఱుగ అర్థము జెప్పుచుందురు. కొందఱు ఇదంతయు అర్థశూన్యమందురు. ఇట్లు చంద్రసూర్యలోకములకు పోవుట అననేమో, విద్యుల్లతంజేరిన వెనుక ఆపురుషుడువచ్చి ఆ జీవునకు తోడ్పడుటనగా నేమో యెవ్వడు నెఱుగడు. హిందువులలో, చంద్రుఁడు జీవమునకు స్థానమని ఒక నమ్మకము కలదు. అంగుండి యీజీవము ఎట్లు లవతరించు చుండునో చూతము.

జ్ఞానసిద్ధిని పొందలేకున్నను ఈ లోకమున పుణ్యకార్యములను గావించినవారు చనిపోవునప్పుడు మొదట పొగను ఆశ్రయింతురు. అందుండి రాత్రిని, తరువాత కృష్ణపక్షమును, పిమ్మట దక్షిణాయనమును, అటనుండి పితృలోకమును, తరువాత ఆకాశమును, పిమ్మట చంద్రలోకమును పొందుదురు. అక్కడవారు దేవతలకు ఆహారమై, కొంతకాలమునకు దేవతలయి పుట్టుదురు. తమ పుణ్యము వ్యయమగువఱకు అచ్చట వసింతురు. వారి పుణ్యము వ్యయమైపోగానే తిరిగి అదే మార్గమున పుడమికి దిగుదురు. మొదట ఆకాశమును, గాలిని, ధూమమును, మంచును, మేఘమును పొంది, తుదకు వర్షబిందు రూపమున పుడమికి వత్తురు. అంత నరుల ఆహారమునజొచ్చి తుదకు వారికి బిడ్డలయి పుట్టుదురు. పుణ్యకర్ములు ఉత్తమ వంశములలోను, దుష్కర్ములు నీచకులములందును పశువులందును సయితము జననమందుదురు. జీవులు సతతము పుడమికివచ్చుచు పోవుచునుందురు. అందుచేత లోకము ఎన్నడును నిండదు, రిత్తవోదు.

దీనినుండియు మనము చాలసంగతులు నేర్చుకొనగలము. ముందుముందు బహుళః యింకను బాగుగ గ్రహించి, దీని అర్థ విచారణ చేయగలుగుదుము. పరలోకమున నుండువారెట్లు తిరిగివత్తురో తెలుపుభాగము మొదటిభాగముకంటె సుగ్రాహ్యమైయుండును. దానిభావమంతయు ఇట్లుతోచుచున్నది. బ్రహ్మజ్ఞానము లభించనిది పరలోకమున స్థిరవాసముప్రాప్తించదు. బ్రహ్మమును తెలిసికొని మానవులు కొందరు సత్ఫలముల నాశించి లోకమున పుణ్యక్రతువు లొనరించి మరణించినచో, వారు ఆయా ప్రదేశములగుండా స్వర్గము చేరుదురు.

మనము ఈ పుడమిని జననముగాంచురీతినే వారక్కడ దేవతలకు బిడ్డలుగా జన్మింతురు. పుణ్యముక్షీణమగువరకును అందు వసింతురు. నామ రూపాత్మకమగునది ఎల్ల అశాశ్వతములను వేదాంతభావము దీనివలన ప్రధానముగా తేలుచున్నది. నామరూపములు గలది ఎల్లయు కాలములో పుట్టి, కాలమునందుండి, కాలమున తుదముట్టవలసియుండును కాన; శాశ్వత స్వర్గము అను పదము అర్థరహితమగుచున్నది. వేదాంతమున ఇవి స్థిరతరసూత్రములు. అందుచేత స్వర్గములు అంగీకృతములుగావు.

మహమ్మదీయులకును క్రైస్తవులకునుస్వర్గము శాశ్వతమైనదను భావమును కలదు. అట్టి భావమును మనము సంహితలందు కాంచియుంటిమి. మహమ్మదీయులు దానికి ఒకింత స్థూలతరరూపము నిత్తురు. అయ్యది వనములతోడను సదా ప్రవహించు నదులతోడను ఒప్పారు స్థలమందురు. అరేబియాదేశపు మరుభూమియందు నీరు ఎంతయు వాంఛనీయము; గావున మహమ్మదీయులు తమస్వర్గమున పుష్కలముగ జలము ఉన్నటుల భావనచేయుదురు. సంవత్సరమునకు ఆరునెలలు వానలు కురియు దేశమున పుట్టినవాడనుగాన నేను స్వర్గమును తేమలేని ప్రదేశముగా భావనచేయువలసియుండును. ఆంగ్లప్రజలును అట్లే భావింపఁగోరుదురు. సంహితయందు చెప్పబడినటుల స్వర్గములు శాశ్వతములే; మృతజీవులు మనోహర శరీరములను తాల్చి, తమ పితృదేవతలతోకూడ, మహానందముతో ఉండిపోదురు. అక్కడ వారు తమ పితలను, బిడ్డలను, బంధువులను, కలిసికొని యిక్కడివలెనే కాపురములుచేయుచుందురు. కాని సుఖమును ఎక్కువగా

అనుభవింతురు. ఐహికజీవితమున వాటిలుచుండు బాధలన్ని యును, అవరోధములన్నియును అదృశ్యములగును; కాని అందలి సద్విషయములును, సౌఖ్యములును మాత్రము నిలిచియేయుండును. నరులు ఇట్టి స్థితిని ఎంతగా సౌఖ్యప్రదమని యెంచినను, సత్యము వేఱుగను సౌఖ్యము వేఱుగనుడున్నవి. అత్యున్నతాగ్రము చేరువఱకును, సత్యము సుఖమునకు దూరముగానేయుండును. మానవనైజము పూర్వాచార పరాయణమైనది. ఒకప్పుడు ఒకపనిని చేయును; అటుల ఒకసారిచేయుటవలన దానినుండి విడివడుట కష్టముగా నెంచును. అసౌఖ్యము వాటిలునను భయముచేత మనస్సు నూతనభావములను స్వీకరింపనొల్లదు.

ఉపనిషత్తులో పూర్వపుమార్గము విడిచి చాలదూరము పోయినటుల కాన్పించును. నామరూపాత్మకమైనదెల్ల నాశము కాక తప్పదు కావున, మరణానంతరము పితృదేవతలతోఁ గూడి వసించనగు స్వర్గమును శాశ్వతము కాదని ప్రకటింపబడినది. రూపముగల స్వర్గములుండెనేని కాలక్రమమున అవి నశించక తప్పవు. అవి లక్షలక్షలాది వత్సరములు నిలిచి యుండవచ్చును గాక; తుదకుఎన్నడో అవియు గతింపకతీరదు. ఈభావమువలన ఇంకొకటి సంప్రాప్తమైనది; అక్కడి జీవులు తిరిగి భూలోకమునకు రావలయును. వారు తమ పుణ్యకార్యముల ఫలములను అనుభవించు తావులే స్వర్గములు. ఆపుణ్యఫలము అంతరించుటతోడనే వారు ఈ భూలోక జీవనమునకు మఱల రావలసినదే. దీనినిఁ బట్టి ఒకవిషయము తెల్లమగుచున్నది. 'నిమిత్త' తత్త్వసూత్రము అనెడు కార్య కారణ పరంపరా ధర్మమును మానవజాతి బహుపురాతన కాలమునందే గుర్తించియుండిరి, కాని అప్పుడాసూత్రము పశివాంద్రభాషలోఁ దెలుపఁ

బడినది, తదనంతరము తత్వవేత్తలు బయలుదేఱి, దానినే తత్వశాస్త్రానుగుణ్యమును తర్కసాంప్రదాయమును అగు భాషలో బ్రకటించినటుల కాన్పించుచున్నది. ఇది సర్వమును అంతరదృష్టిచే లభించునది అని మీరీగ్రంథములఁ పఠించుచో గ్రహింపగల్గుదురు. ఇది ఆచరణయందు ప్రత్యక్షోపయోగము అగునాయని మీరు నన్నడిగితిరేని "ఔను" అనుటే నా జవాబు. ఇందు ఎల్లెడల, మొదట అనుష్ఠానమును, తదనంతరము తత్వసిద్ధాంతమును కాన్పించుచుండును. ప్రథమమున ఈ షయములను కనిపెట్టి అనుభవముపొంది అనంతరము గ్రంథముల వ్రాసిరని తెలిసికొనగలము. ఆప్రాచీన జిజ్ఞాసువులతో ఈ ప్రకృతి మాటలాడినది. పక్షులు వారితోఁ బ్రసంగించినవి; మృగములు వారితో ముచ్చటించినవి. సూర్య చంద్రాదులు వారికి సుద్దులు చెప్పినవి. క్రమేణవారు వస్తువుల తత్వమును గ్రహించిరి. ప్రకృతియొక్క హృదయమునుఁ పరికించిరి. వారటుల కావించినది కేవలము మననము చేతగాదు సుడీ. తర్కసాధనము వలనను కాదు; ఈ దినములలో ఆచారమై పోయినటుల ఇతరుల మెదడులను గిల్లుకొని కూర్చి గ్రంథములను తయారు చేయుటనుగూడ వారు పూనలేదు. వారి పీరిగ్రంథములలోని అంశములను తీసికొని ఉపన్యాసములను కూర్చుటను సయితము వారు అవలంబించలేదు. ఓర్పు మెయి విషయ పరిశీలనము చేసి నూతనాంశముల గ్రహించుచు, వారీ మూల తత్వమును కనిపెట్టియుండిరి. వారి ప్రధాన సాధనము అనుష్ఠానము. ఎప్పటికైనను అట్లే కావలయును. మతము అనునది అనుష్ఠాన శాస్త్రము. కేవలము దైవప్రోక్తములైన మతములు ఇదివఱ

కొన్నడును లేవు; ఇంక నుండబోవు. ప్రథమమున అనుష్ఠానము; తుదను జ్ఞానము! ఆత్మలు మఱలివచ్చునను భావము అది వఱకేయున్నది. ఫలాపేక్షబూని సత్కార్యములను ఆచరించు పురుషులు ఫలమును పొందుదురు, కాని ఆఫలము శాశ్వతము కాఁజాలదు. ఫలము కార్యమును అనుసరించిమాత్రమే యుండఁగలదని తెలిపెడు నిమిత్తమాత్రము చక్కఁగా ఇందు వ్యక్తము కావించబడినది. కారణము పరిమితము; కాబట్టి ఫలమును పరిమితంబై యుండును. కారణమువెట్టిదో ఫలమును అట్టిదియే. కారణము అనంతమైయున్నచో ఫలమును శాశ్వతమై వఱలనగును. కాని కారణములన్నియు అనగా పుణ్యకార్యముల సలుపుట మొదలగు అన్ని విషయములును, పరిమితములగు కారణములుగా మాత్రమే ఏర్పడగలవు. కాబట్టి శాశ్వతములగు ఫలములను ఒసగఁజాలవు.

ఇప్పుడు రెండవపక్షమును విచారణకు తీసికొందము. శాశ్వత స్వర్గములుండజాలవు. కావున, ఆహేతువుచేతనే శాశ్వత నరకములును ఉండజాలవు. నేను నాజీవితమున అనుక్షణము దుష్కార్యముల గావించు దుష్టమానవుఁడనే అనుకొనుడు. అయినను గూడ నాశాశ్వత జీవనముతోడ పోల్చి చూచినయెడల నా యీజీవిమంతయు కూడ అత్యల్పమే! శాశ్వతశిక్షయే యున్నయెడల, పరిమితమగు కారణమువలన అపరిమితమగు కార్యము (ఫలము) కల్గుచున్నదనుటేగదా! అది పొసగదు. నాజీవితమంతయు సత్కార్యములనే చేయుచున్నను నాకు శాశ్వతస్వర్గమును లభింపఁజాలదు. అట్లనుటయు పొఱబాటేఅగును. ఇకను బ్రహ్మము నెఱింగిన వారికి అనగా అపరోక్షానుభూతి గడించినవారికి సమకూడగల

మూఁడవమార్గమున్నది. మాయయొక్క ఆవరణను దాటుటకు ఇదొక్కటే మార్గము. బ్రహ్మసాక్షాత్కారమును సాధించవలసి యున్నది. బ్రహ్మసాక్షాత్కారము అననేమో ఉపనిషత్తులు విశదీకరించి యున్నవి.

సర్వమును బ్రహ్మమునుండి వచ్చునదని గ్రహించి శుభమనిగాని అశుభమనిగాని పరిగణించదగదని దాని భావము. బ్రహ్మము సర్వమునందును కలదు. ఈజగత్తు మిథ్యఅనుటే దాని అర్థము. ఈజగత్తునుండి నేత్రములమూసి మఱలించివేసి స్వర్గనరకముల రెండింటను "బ్రహ్మమును" చూచుటేదీనిగమ్యము. జననమరణముల రెండింటను బ్రహ్మమును గాంచుటే! నేను పైన తెలిపిన వాక్యమునందలి భావసరణి యిట్టిది! ఈభూమండలము పరమేశ్వరుని విగ్రహమే. ఆకాశము భగవంతుఁడే, మనమాక్రమించి కూర్చుండిన స్థలము బ్రహ్మమే. సర్వమును బ్రహ్మమయము! దీనిని గ్రహించి సాక్షాత్కారానుభవమునకు తెచ్చుకొనవలయును. ఊరక దానిగూర్చి వాదులాడిన చాలదు. కేవలము ఊహామాత్రము చేసిన చాలదు. ఇట్టి భావసరణిని అనుసరించి, సర్వమును బ్రహ్మమయమై యీశ్వరాంశముతో నిండియున్నదని సాక్షాత్కారమునకు తెచ్చుకొనినప్పుడు అట్టి జీవుడు స్వర్గమునకు పోయినను, నరకమునకు పోయినను మఱెచ్చటికి పోనున్నను లక్ష్యము చేయఁడని తెలిసికొనఁగలము. ఆజీవుఁడు తిరిగి భూలోకమున జన్మించిననేమి? స్వర్గమున జన్మించిననేమి? ఈవిషయములు అట్టివాడు పాటించునవికావు. సర్వము వానికి ఒక్కటియే. ప్రతిస్థలమును బ్రహ్మనిలయమే. అన్నితావులును పవిత్రములే; స్వర్గమునగాని, పాతాళమునగాని, మఱెచ్చటగాని, బ్రహ్మమే వానికి

సాక్షాత్కరించు చుండును. శుభాశుభములు జనన మరణము లును గణనకు రాజాలవు; ఒక్క అఖండ పరబ్రహ్మమే యెల్లె డల నిండియుండును!

వేదాంత మతానుసారము, ఇట్టి సాక్షాత్కారమును పొందిన నరుఁడు ముక్తుఁడగును; అట్టిపురుషుఁడేయీ లోక మున వసించుటకు అర్హుఁడు. ఇతరులు అర్హులేకారు. పాపము ఎవనికి గోచరించునో అతడు ఈలోకమున వసించుటకు ఎట్లు కోరఁగలఁడు? వాని జీవితము దుఃఖభాజనమగునుగదా. అపా యములను ఎదురు చూచుచుండువాని జీవితము దుఃఖమ యము. మరణమును ఎదురుచూచువాని జీవితము దుఃఖ రాశియే. బ్రహ్మవిదుడు అనగా సర్వమునందును బ్రహ్మమును చూడగల పురుషుఁడుమాత్రమే ఈలోకమున జీవింప నర్హుఁడు; అతడుమాత్రమే "నేను జీవితానందమును అనుభ వించుచున్నాను; ఈ జీవితమున సుఖముగ నున్నాను" అని పలుకఁగలవాడు. ఈసందర్భమున వేదములలో ఎక్కడను నరక ప్రశంసయే లేదని తెలుపఁగోరెదను. చాలకాలమునకు పిమ్మట అది పురాణములందుఁ తలజూపినది. వేదములను అను సరించి మనకుఁ రాఁగల ఘోరతమశిక్ష యీలోకమున తిరిగి జన్మించి, మఱల ఐహికజీవితమును గడుపవలసివచ్చుటే! ప్రప థమమునుండియు నిర్గుణము వైపున దృష్టినిలుపు ఉద్యమమే గోచరించు చున్నది. బహురూపాకృతులు శిక్షలంగూర్చిన భావ ములు మిగులస్థూలములు. మనవలెనే ఒకని ప్రేమించుచు మఱొకని ద్వేషించుచు నుండు మానవలక్షణ సమన్వితుఁడగు భగవంతుఁడు కలడను భావమునకు మాత్రమే యివి అను సరణములైనవి. అటువంటి దేవుడు ఉండినచో శిక్షలు బహు

మానములు సమంజసములు కాఁగలవు. సంహితయందు అట్టి దేవుఁడు చూపట్టగలఁడు. భయము అను భావము అందు జొచ్చుచున్నది. ఉపనిషత్తుల విచారణకు దిగినతోడనే భయము అనునది అదృశ్యమగుచున్నది; నిర్గుణభావము నెలకొనుచున్నది. నరుఁడు సదా సగుణమునే గట్టిగ పట్టుకొని యుండుటచేత, సహజముగ వానికి నిర్గుణభావము గ్రాహ్యమగుట దుస్తరము. ఘనమనీషావంతులను పేరొందిన పురుషులు సయితము నిర్గుణ బ్రహ్మము అనఁగానె వెగటుజెందుదురు కాని నాకు మట్టుకు భగవంతుని సాకారుఁడగు నరునివలె భావనచేయుట బొత్తుగ అవివేకముగ తోఁచును. చేతనుఁడగు భగవంతుని భావనయా లేక నిర్జీవుఁడగు భగవంతుని భావనయా? ఇందేది శ్రేష్ఠతరము? ఎవరును కాంచలేనట్టియు, ఎవరును ఎఱుగనట్టియు బ్రహ్మ శ్రేష్ఠుఁడా? లేక ప్రత్యక్షమునకు రాఁగల బ్రహ్మమా?

నిర్గుణబ్రహ్మము సచేతనుఁడయిన దేవుఁడు; ఒక మహా తత్వము. సగుణబ్రహ్మ ఒకపురుషమాత్రుఁడే! నిర్గుణబ్రహ్మమో దేవుఁడు, నరుఁడు; జంతువు; మఱియు నింక మనము గ్రహింపఁ జాలనిదెల్లయునై వెలుఁగును! నిర్గుణ సగుణముల భేదమిది. నిర్గుణమున సగుణ రూపములన్నియు చేరియే యున్నవి; ఈజగత్తులోఁగల సర్వమునేఁగాక, పరిపూర్ణత యెల్ల దానియందిమిడియున్నది. "ఒక్క అగ్ని సృష్టిలో ప్రవేశించి అనేకరూపములు తాల్చుచున్నది. అయినను దాని అఖండ స్వరూపము ఇంకను ఎంతయోఁగలదు. నిర్గుణతత్వమన ఇటువంటిది! మనము సచేతనుఁడగు భగవంతునే ఆరాధింప కోరుచుందుము. భగవంతుఁడు కాని దానిని దేనిని నాజీవితమున నేను కాంచి యుండలేదు. మీరును కాంచఁగలిగి యుండరు.

ఈ కురిచీని చూచుటకు మీరు మొదట భగవంతుని చూచి, అనంతరము వానియందే వాని ద్వారముననే మీరు కురిచీని కాంచగల్గుచున్నారు. "అహమస్మి" అనుచు ఆయన యెల్లెడల వెలుంగుచున్నాఁడు. "అహమస్మి" అని నీవు గ్రహించిన తోడనే అస్తిత్వభావము నీ అనుభవమునకు వచ్చుచున్నది. మన హృదయములందును, ప్రతిజీవియందును కాంచలేని యెడల మనము ఆయనను చూచుటకై ఎక్కడికి పోగలము? "నీవే పురుషుడవు, నీవే స్త్రీవి; నీవే బాలుఁడవు; నీవే బాలికవు; కఱ్ఱపై ఊనుకొని తడబడుచుపోవు ముసలివినీవే; పూర్ణ జవసత్వములు గలిగి గర్వమున నడయాడు యువకుఁడవు నీవే; అస్తిత్వము గలది సర్వము నీవే!" ఈ సృష్టియందుఁ గల సర్వముతానై వెలుంగు సచేతనుఁడగు బ్రహ్మముయొక్క భావన యెంత అద్భుతమో! ఏదో ముసుగు వేసికొని, యెవనికిని ఎన్నఁడును సాక్షాత్కరించనట్టియు మనము పారంపర్యముగ చెప్పుకొనుచుండినట్టియు, దేవుని మించిన ఈ భావన అనేకులకు భీతావహముగ తోచుగాక. తమను అనుసరించి నడచుచు, తమ మందలింపులకు చెవియొగ్గుచు, తాము నిర్ణయించు మార్గమును జవదాటక వర్తించినయెడల; మరణించునప్పుడు మనము దేవుని ప్రత్యక్షముగ చూచుటకయి తామొక అధికారపత్రమును ఇచ్చెదమని మతగురువులు మనకు నమ్మకము జెప్పుదురు! అర్థశూన్యమగు మతగురు సంప్రదాయముయొక్క బూటకపురూపములు దప్ప యీ స్వర్గములన్నియు ఏమిటి? కాని నిర్గుణతత్వము మిగుల నిర్మూల కారణమనుట తథ్యమే! ఇయ్యది పురోహితుల వృత్తిని, చర్చిలను, దేవళములను త్రోసిపుచ్చుననుట నిజము. హిందూదేశ

మును ఇప్పుడు క్షామము పీడించుచున్నది. కాని చక్రవర్తి నైనను పణముగా కొనజాలు నంతటి ఆ రత్నరాసులతో నొప్పు దేవళములు ఎన్నియో గలవు ! నిర్గుణతత్వమును ప్రజలకు బోధించిరేని ఇట్టి పురోహితుల వృత్తి నాశమై పోగలదు. అయిననేమి ? పురోహితులను విడిచివేసి యీ తత్వమును నిష్కామబుద్ధితో బోధించవలసియేయున్నది. నీవు బ్రహ్మము, నేనును బ్రహ్మము, ఎవరు ఎవరికి దాస్యముచేయుట ? ఎవరు ఎవరికిని పూజించుట ? నీవే ఈశ్వరునికి ఉత్తమోత్తమాలయము. ఒక దేవాలయమునుగాని, విగ్రహమునుగాని, బైబులును (వేదమును) గాని యారాధించుట కన్న నిన్ను ఆరాధించుట నాకిష్టము. కొందరు జనులు పరస్పర భిన్నభావములతో నుండుట యేలనో? వారు చేతిలోనుండి జారిపోవు చేపల చక్కినున్నారు. తామెంతో సుస్థిరానుష్ఠానపరుల మని చెప్పు కొందురు మంచిదే. నీకు పూజల నర్పించుటకంటె, నిన్ను ఆరాధించుటకంటె ఉత్తమతరానుష్ఠానము ఏమిగలదు? నేను నిన్ను చూచుచున్నాను, స్పర్శించుచున్నాను. నీవు బ్రహ్మమని నే నెఱుగుదును. 'అల్లా' వినా దైవము లేడని మహమ్మదీయుఁడు చెప్పుచున్నాడు. దైవముగానిది ఏదియులేదని వేదాంతము ఉద్ఘోషించుచున్నవి. ఇది వినుట మీలో చాలమందికి భీతావహముగ నుండవచ్చును. కాని ముందుముందు మీరు దీనిని గ్రహింపఁజాలుదురు. భగవంతుఁడు సచేతనుఁడై మీలో అధివసించుచున్నాఁడు. అయినను వెఱ్ఱి యూహాపోహాలకులోనై మీరు చర్చిలను దేవాలయములను కట్టించుచున్నారు. మానవ శరీరములో అధివసించు జీవాత్మమాత్రమే పూజార్హమగు దైవమునుడీ! అన్ని జంతువుల తనువులును దేవళములు అను

టయునిజను. అయినను నరశరీరముఉత్తమోత్తమమై, దేవాలయములలో తాజ్‌మహాలువలె చెన్నారుచున్నది. అందు నేను పూజలొనరింపజాలనైతినా, యింకేదేవాలయములును ప్రయోజనకరములు కావు. ప్రతి నరుని శరీరమునందును ఆసీనుఁడై వెలుఁగు భగవంతుని నేను సాక్షాత్కారము చేసికొనిన తోడనే, సర్వమానవుల యెదుటను భక్తిపూరితుఁడనై నిలువఁజాలి, వారి యందలి దేవుని నేను దర్శింపఁజాలినతోడనే, ఆక్షణముననే నేను బంధవిముక్తుఁడ నగుచున్నాను. నన్ను బంధించు సర్వమును పటాపంచలు కాఁగలదు. నేను సర్వముక్తుండనై నిలుతును.

అన్నింటిలోను ఇది మిగుల ఆచరణీయమగు ఆరాధన. దీనికి సిద్ధాంతములతో పనిలేదు ఊహాపోహలతో పనిలేదు. అయినను పలువురు భీతిలుచున్నారే! ఇది ధర్మముకాదందురే! ఎక్కడనో స్వర్గములోదేవుడుండి, ఎవరితోడనో తానే దేవుడనని చెప్పినట్లు తమపూర్వులెవరో పలికిరని, పురాతనాదర్శములనుగూర్చి సిద్ధాంతములను అల్లుచు గూర్చుందురే! అప్పటినుండియు కేవలముసిద్ధాంతములే మన వెంటఁబడినవి. వారిఅభిప్రాయములో అదే ఆచరణయోగ్యమట! మనభావములుఅనుష్ఠానమునకు అనర్హములట! ప్రతివాడును తన ప్రత్యేకమార్గమును అనుసరించవలయునని వేదాంతము బోధించుటయు నిజమే. కాని మార్గమే పరమగమ్యము కాఁతగదు. స్వర్గమునందు భగవంతుఁడు కలడని ఆరాధనలు పలుపుట మొదలగు ఇట్టి విషయములును దోషములుకావు; అవి గమ్యమును జేర్చు సోపానములు! అంతేగాని అవియే పరమావధి అనఁతగదు. అవి మంచివే. మనోహరములే. అందు కొన్ని మహాద్భుత

భావములు ఇమిడియున్నవి. కాని వానివిషయమున వేదాంతము పలుకునది ఇది: "మిత్రమా! అజ్ఞేయుడు అని నీవు ఆరాధించు దైవము నిన్నుగా భావించి నేనుపూజింతును. అజ్ఞేయుఁడని భావించి ఎవ్వనికి పూజలర్పించగోరి, ఎవ్వరికొఱకు జగమునం దెల్లెడల నీవు వెదుకుచున్నావో, అతడు సర్వకాలము నీతోడనే ఉన్నాఁడు సుమీ. వాని ద్వారముననే నీవు జీవించుచున్నాఁడవు. ఆయన సదా జగద్ద్రష్టయై యొప్పుచున్నాఁడు" "ఆమ్నాయము లన్నియు ఎవని సేవించుచున్నవో, యింతేల, "అహం" అను అఖండభావనతో ఎవడు సర్వకాలము ప్రకాశించు చున్నాడో, అతడు ప్రకాశించుటచేతనే ఈసృష్టియెల్ల ప్రకాశించుచున్నది. అతడే జగత్తునకు ప్రాణమును తేజమునై యున్నాడు. ఆ "నేను" నీలో లేనియెడల నీవు సూర్యుని కాంచనేలేవు. సర్వమును తమోరాశియై పోవును. అతడు ప్రకాశించుటచేతనే నీవు జగమును కాంచగల్గుచున్నావు. అని వేదాంతము బోధించుచున్నది.

సామాన్యముగా ఇట్లు ప్రశ్నింతురు, దీని వలన మహానర్థము వాటిల్లదా? అని అడుగుదురు. మనలో ప్రతివాడును "అహంబ్రహ్మాస్మి—నేను బ్రహ్మము. నేనేది ఒనరించినను, నేనేది తలంచినను అదెల్ల ధర్మమేయగును. దేవుఁడు దోషము చేయఁగలడా?" అని భావింపఁదగును. ఇట్టి దుర్భావము కలుగునని మొదట అంగీకరించిననుకూడ అట్టి అపాయమే యిది, వఱకు నయితము లేదని రుజువేమి? మీనుండి వేఱై యెక్కడనో స్వర్గమందున్న భగవంతుని మీరు పూజించుచున్నారు. వాని గూర్చి మీరు భయపడుచున్నారు. ఈ భయముతో గజగజ లాడుచు జన్మించుచున్నారు. ఆజన్మాంతము మీరిట్లు

వణకుచునే యుందురు. సరే, దీనివలన లోకమున్నతికి వచ్చుచున్నదా? సగుణ బ్రహ్మను తెలిసికొని వానిని ఉపాసించు వారిలోను, నిర్గుణ బ్రహ్మమును తెలిసికొని వానిని ఉపాసించు వారిలోను, ఎవరినుండి యెక్కువ మంది లోకోద్ధారకులు బయలుదేరిరో విచారించుడు. మహాకార్య దీక్షాపరులును, మహత్తర ధర్మతత్పరులును ఎవరియందు జలజూపుచుండిరి? నిర్గుణోపాసకు లందుండియే అనుట తథ్యము. భయము నుండి ధర్మ తత్పరత యెట్లువెలువడగలదు? అదెన్నడును పొసగదు. "తాను ఇంకొకని కాంచుటయు, తాను ఇంకొకనికి అపకారము చేయుటయు, అంతయు మాయయే. తాను ఇంకొకనిని చూడక, తాను ఇంకొకనికి అపకారము చేయక సర్వమును నాఆత్మయేయై వెలుగుచో, ఎవడు ఎవని చూచుట? అన్యునిగుర్తించువాడెవడు? సర్వమును బ్రహ్మమే. సర్వమును "నేనే" ఐయుంటిని. అప్పుడు జీవుడు పవిత్రుడగును. అప్పుడే ప్రేమ అననేమొ తెలియవచ్చును. ప్రేమ భయమునుండి ఉద్భవము కాజాలదు. స్వేచ్ఛయే ప్రేమకు మూలకందము. మనము నిజముగా ప్రపంచమును ప్రేమించ మొదలిడినప్పుడే భ్రాతృత్వము అననేమో, మానవజాతి అననేమో నిజముగా మనకు అర్థము కాగలదు. అంతవఱకును అది అర్థము కాజాలదు.

ప్రపంచములో సగుణారాధనవలన దుష్కార్యములు జరుగవనియు, నిర్గుణభావము మహానర్థమునకు మూలమగును అనియు చెప్పుట యుక్తముగాదు. సగుణారాధనయే ప్రపంచములో మతద్వేషముల బుట్టించి, లోకమును రక్తములో ముంచి,నరులు ఒండొరులను చీల్చి చెండాడునటులచేసి యుండె

గదా! "నా దేవుడే ఉత్తమోత్తముడు; రా దెబ్బలాడుటచే నిర్ణయించుకొందము" లోకమునందు ఎల్లెడలను ద్వైతము నకు ఇది ఫలమైనది. అనంతమై యొప్పు ఆత్మ ఒక చిన్న గొందిలోబడి జీవించుటకును చచ్చుటకును ఎట్లొడంబడగలదు? రండు! బయటికి రండు! పూర్ణ ప్రకాశములోనికి రండు! తేజో మయమగు జగత్తులో ప్రవేశించుడు! ఈ జగమునగల సర్వ మును మీయదియే. చేతులజాచి ప్రేమాలింగనము చేసి కొనుడు. అటుల కావించుబుద్ధి నీకువొడమెనా నీవు భగవంతుని స్పర్శించినట్లె!

అల బుద్ధుని ఉపదేశవాక్యము మీరు జ్ఞప్తినుంచు కొనుడు. ఆతడు తన ప్రేమసంకల్పమును ప్రాక్పశ్చిమోత్తర దక్షిణదిశలకును, క్రిందికిని మీదికిని సకలదిక్కులకును ప్రస రింపజేసి, సాంద్రమును, ఘనమును, అనంతమును అగు తన ప్రేమతో జగమునెల్ల ఎట్లునింపెనో స్మరింపుము. అట్టి భావము మీకు కుదిరినప్పుడు పురుషత్వము సిద్ధించుచున్నది. జగమం తటఒక్క పురుషుడే నిండి వెలుంగును. అల్పవిషయములను విడిచి వేయుము. పరిపూర్ణముకొఱకై అల్పభావములను త్యజిం చుము; శాశ్వతానందము కొఱకు క్షుద్రభోగముల విసర్జిం పుము. సగుణభావము నిర్గుణ తత్వమున యిమిడియేయున్నది. కాన సమస్తమును నీకు నిలిచియేయుండును. ఇట్లు బ్రహ్మము నిర్గుణుడును సగుణుడును గూడ అగుచున్నాడు. అనంత రూపుడగు పురుషుడు అనగా నిర్గుణుడగు పురుషుడు తానే (సగుణుడుగా అనగా) నరుడుగా రూపాంతరమును పొందు చున్నాడు. పరిపూర్ణమగు మనము చిన్న చిన్న భాగములలో ఇమిడి మితత్వమును ఆరోపించుకొన్నాము అనవచ్చును. పరి

పూర్ణతయే నీ స్వభావమని వేదాంతము బోధించుచున్నది. ఆలక్షణము ఎన్నడును నమసిపోదు. శాశ్వతమై నిలుచునదే. మన మెడచుట్టి పట్టుకొని కించిత్వమునకు పడలాగు గొలుసు వంటి కర్మమూలమున మనము పరిమితిని అంగీకరించు చున్నాము. ఆగొలుసును తెగవేయుము; నీవు ముక్తుడవు కమ్ము! శాస్త్రమును కాలిక్రిందఁబెట్టి రాచివేయుము. పురుషత్వమునకు హద్దుబెట్టు శాస్త్రములేదు. విధివ్రాత యనునది లేదు. ప్రారబ్ధమునులేదు. అనంతమును బంధించు శాస్త్రవిధి అనునది ఎట్టుండగలదు? స్వాతంత్ర్యము దాని సంకేతము! స్వేచ్ఛ దాని స్వభావము; స్వేచ్ఛయే దాని జన్మస్వాస్థ్యము. ఒక్కసారి స్వాతంత్ర్యమును వహించి పిమ్మట నీకిష్టమువచ్చి నన్ని గుణగణములను నీయందు ఆరోపించుకొనుము, అప్పుడు నీవు నాటకరంగమున నిచ్చి బిచ్చగాని వేసము వేసి ఆటలాడు వానివలెనుందువు. మన వీధులలో తిరిపెమెత్తు బిచ్చగానికిని నీకును భేదము తలపోయుము. క్షేత్రవైఖరి బహుళః ఒకటిగనే కాన్పింపవచ్చును; ఇరువురు పలుకు నుడులును ఒకేరీతిగ నుండవచ్చును? కాని నిజముగా ఎంత భేదము గలదో చూడుము. ఒకని దారిద్ర్యము వేడుక; రెండవయతనిది అత్యంతదుఃఖ భాజనము, ఈభేదమునకు హేతువేమి? ఒకడు స్వతంత్రుఁడు; రెండవవాఁడు బద్ధుడు. నటునకు తన దారిద్ర్యము సత్యము కాదనియు, తాను ఊరక క్రీడార్థము ఆరోపించుకొనినదే అనియు, తెలియును. రెడవయతడో అది తన నిత్యదశయే యనియు, తనకు యిష్టమున్నను లేకున్నను దాని బాధను అనుభవించియే తీరవలయుననియు ఎఱుంగును. ప్రకృతి ధర్మమిట్టిది మన సత్యస్వభావమును గ్రహించువఱకును

మనము దిక్కులేని బిచ్చగాండ్రమే. ప్రకృతిలోని ప్రతిదాని చేతను నిటునటు తన్నులు తినుచుండవలసినదే. సృష్టిలోని ప్రతిదానికినిదాస్యముచేయవలసినదే. ప్రపంచమంతట అంగలార్చుచుతిరుగాడవలసినవారమే. అయినను సాయము మాత్రము ఎందుండియు లభించదు. కాని ఇంకను ఇంకను రక్షణము చేకూరఁగలదను పేరాశవీడక యేడ్చుచు, విలపించుచు, దేవురించుచునే ఉందుము. ఇట్లొక జన్మగడుచును; ఇంకొకటి వచ్చును, కాని వెనుకటి ఆటయే సాగును!

స్వాతంత్ర్యము పూనుము. దేనికొఱకుగాని యెవరినిగాని దేవురించకుము. నీ పూర్వజన్మలను వెనుకకు తిరిగి తిలకించితివేని, ఇతరుల సాహాయ్యమును వేడుచు సదా నీవు వాపోవుచునేయుంటివనియు, కాని అది నీకు ఎన్నడును ప్రాప్తించియుండలేదనియు, నీవు గ్రహించగలవు సుమీ! నా మాట నమ్ముము! ఏదేని సాహాయ్యము నీకు చేకూరినచో అది నీ అభ్యంతరము నుండియే వచ్చియుండును సుమీ! నీవు దేనికై పాటుపడియుంటివో ఆకర్మఫలమే నీకు ప్రాప్తించియుండును. అయినను సదా నీవు ఇతరుల సాహాయ్యమునకై దేవురించుచుండుట ఆశ్చర్యము. శ్రీమంతుని గృహద్వారము సంతతము నిండియుండును; కాని అందు గాన్పించువారు మారిపోవుచునేయుందురు. ఈ బిచ్చగాండ్రు ఆశ్రీమంతునివలన తమకు గొప్ప మేలు చేకూరునని ఆశపడుచుందురే గాని, వారికట్టిది ఎన్నడును లభింపదు. అటులనే ఆశలపై ఆశ పెంచుకొనుచు మన జన్మలగడపుచుందుము. ఈఆశలు తుదముట్టుటయుండదు. ఆశను విడనాడుమని వేదాంతము బోధించుచున్నది. నీవు దేనినైనను ఆశింపనేల? సకలము నీయదియేగదా! ఇంకేల? సర్వము నీవ

కావే? దేనికొఱకై నీవుఅర్థించుట? ఒక రాజునకు పిచ్చియెత్తి, తనదేశపుప్రభువును కాంచవలయునని అతడుయింటింటను వెదుక మొదలిడెనట. ఆతడే ప్రభువైయుండగా వానికి వేఱొకరాజు గాన్పించుటెట్లు? కావున మనమే బ్రహ్మమను యెఱుకనుపొంది; బ్రహ్మముకొఱకని వెడలురీతి ఎక్కడనో వెదకులాడుట మానందగును. మనమే బ్రహ్మమని గ్రహించినచో ఆనందము నందగలము. సంతృప్తియు కలుగును. కావున నీ పిచ్చిపోకడల నన్నిటిని కట్టిపెట్టుము. అప్పుడు నాట్యరంగమునందలి వేష ధారునివలె, ఈజగమున నీవు ఆటాడఁగలవు. అప్పుడు నీదృష్టియే మాఱిపోఁగలదు. ఈజగత్తు శాశ్వత బంధనాగారముగ నుంటకు మారుగా నాట్యరంగముగ మారిపోవును. స్పర్థకు నిలయముగా ప్రదేశముగ ఉంటకు మారుగా ఆనందనిలయ మై యొప్పును. సంతత వసంతము! ఎక్కడచూచినను భ్రమర నాట్యములే! నరక కూపమై కాన్పించు ఈప్రపంచమే స్వర్గ తలమై వెలయును. జ్ఞానినలకు ఈలోకము హింసాకర ముగా తోఁచును. ముక్తులైనవారి దృష్టిలో ఇది ఆనందసాగ రమే! ఈజీవితమే విశ్వజీవనము; స్వర్గనరకములన్నియు ఇక్క డనే యున్నవి. నరాకృతులతో దేవతలందఱు ఇక్కడనే యున్నారు. దేవతలు తమనుబోలి నరుని సృష్టిచేయుట అబ ద్ధము. నరుఁడే తనునుబోలు దేవతలను సృష్టించుచున్నాడు. ఆనరసదృశ మూర్తులు ఇక్కడనే యున్నారు. ఇంద్రుడిక్కడనే యున్నాడు, వరుణు డిక్కడనే యున్నాడు. సకలదేవతలు ఇక్కడనేయున్నారు. మన ప్రతిరూపములను మనమే ఇట్లు ఆవిష్కృతి చేయుచున్నాము. ఈ దేవతల మూలమూర్తులము మనమే. మనమే సత్యస్వరూపులము. పూజార్హముగా దేవత

లము మనమే. వేదాంతాదర్శమిది! ఇదెంతయు అనుష్ఠాన యోగ్యము. మనము స్వతంత్రులము అయిన పిమ్మట ఆత్మాందోళనము అవసరములేదు. సంఘమును త్రోసిపుచ్చు ఆగత్యముండదు. ఏయడవిలోనో, యేగుహాంతరములోనో చావనెంచి పరుగులిడ నక్కఱలేదు. మనము ఉన్నతావుననే నిలువగలము. కాని సర్వమునుగ్రహించి మెలగజూతుము. పూర్వపు వికృతులే యుండును. కాని వానింగూర్చి నూతనభావము అమరియుండును. మనమింకను ప్రపంచమునుఁ గ్రహించినట్లు గాదు. ముక్తిద్వారముననమాత్రమే ప్రకృతి యిట్టిదని తెలిసి దాని స్వభావమును బూర్ణముగ గ్రహింపఁ జాలుదుము. అప్పుడు ప్రకృతిశాస్త్రమనునది, దైవసంఘటనమనునది లేక బ్రహ్మప్రాత యనునది మన స్వభావములోని అత్యంతల్పాంశమే గ్రహించఁగల్గుదుము. ఇదొకపక్షము. రెండవ పక్షమున శాశ్వతముక్తి పఱగుచున్నది. ఈ రహస్యము మనకు తెలిసి యుండక పోవుట చేతనే, వేటగానిచే దరుమబడు కుందేలులీల తలను నేలలోదూర్చి ముప్పుతప్పించుకొనఁ జూచుచున్నాము. భ్రమతులోనై మన నిజస్వభావమును విస్మరింపఁ జూచుచున్నాము, కాని మఱవలేకున్నాము. మన సత్యస్వభావము ఎప్పుడును మనను ఆహ్వానించుచునే యున్నది. భగవంతుని కొఱకుగాని ఆయాదేవతల కొఱకుగాని, బాహ్యస్వాతంత్ర్యము కొఱకుగాని దేవులాడుట యంతయు, మన సత్య స్వభావమును తెలిసికొనుటకై మనము సాగించు అన్వేషణమేసుడీ! మనము ఆవాణిని అన్యథా తలచితిమి. అయ్యది అగ్నినుండియో, ఏదేవతనుండియో, సూర్యుని నుండియో, చంద్రుని నుండియో, ఇంద్రునినుండియో, నక్షత్రములనుండియో,

వచ్చుచుండెనని భ్రమించితిమి. తుదకు అది మనఅభ్యంత రమునుండియే వచ్చునదని ఎఱింగితిమి. శాశ్వతము క్రింగూర్చిన ఈనిత్యవాణి మనలోపలనే యున్నది. దానిమధురగానము సదాసాగుచునే యున్నది. ఆత్మనుండి వెలువడు ఈ గానమున ఒక అంశము భూమిగను, ప్రకృతి శాస్త్రముగను, జగత్తుగను, రూపాంతరము పొందినది. కాని అది సదామనదేసుడీ! నిరంత రము మనదై యే యుండును. వేయేల, మానవుని సత్యస్వరూప మును ఎఱుంగుటయే వేదాంతాదర్శము! అదిగావించు ఎచ్చరిక ఘుట్లుండును. ప్రత్యక్ష బ్రహ్మస్వరూపమే యగు నీసోదరమాన వుని నీవు ఆరాధింపఁజాలవేని, అవ్యక్త పరబ్రహ్మమును నీవు ఎట్లుపాసన చేయఁగలవు?

మీకు బైబులులోని వాక్యము జ్ఞప్తిలేదా? "నీవుకన్ను లార చూచు నీ సోదరుని ప్రేమింపజాలనియెడల నీవు చూడ జాలని దేవునెట్లు ప్రేమింపగలవు?" నరుని ముఖములో మీకు బ్రహ్మము కానరానియెడల, మేఘము లందును, స్తబ్ధమును నిర్జీవమును అగు జడపదార్థముతో చేసిన విగ్రహములందును, నీమెదడు సృష్టించు కల్పిత గాథలందునుమీ రెటుల ఆబ్రహ్మము జాడ కనుగొనగల్గుదురు? మీరు స్త్రీలయందును పురుషుల యందును భగవంతుని కాంచజాలిన నాటినుండియే మీరు మతాసక్తిగలవారని నేనెంచుదును; అప్పుడే కుడిచెంపపై కొట్టినవానికి ఎడమచెంపచూపుట అననేమో మీకు తెలియఁ గలదు. మీరు నరుని బ్రహ్మముగా చూడగలిగినప్పుడే సర్వ మును, పెద్దపులి సయితము, ప్రేమార్హమై మీకుకాన్పించును. మనల నేది సమీపించినను, మనతండ్రి, మనతల్లి, మనస్నేహి తుఁడు, మనబిడ్డ మొదలగు వివిధరూపములఁదాల్చి దర్శనమిచ్చు

బ్రహ్మమే, అశాశ్వత దివ్యస్వరూపుఁడే అని తెలియగలము. వారు మనతోడ లీలలసలుపు మన యాత్మ స్వరూపములే అగుదురు.

ఇట్లు మన ఐహిక బాంధవ్యములు పారమార్థికములు కాగలుగు నటులనే, భగవంతునికిని మనకును గల సంబంధము నయితము అట్టి యేరూపమునన్నైనను ఉండగలదు. మనము భగవంతుని తండ్రిఁగా గాని తల్లిగాఁగాని, నెయ్యునిగాఁగాని, ప్రియునిగాఁగాని భావించవచ్చును.

భగవంతుని తండ్రియని పిలుచుటకంటె తల్లియనుట భవ్యతరము; నెయ్యుఁడనుట యింకను ఉన్నతమైనది. ప్రియునిగా భావించుట ఉత్తమోత్తమము! ప్రియుని ప్రేయసిని అభేదముగా చూడజాలుట పరమోత్తమ భావనయగును. పరిషియను కథ ఒకటిగలదు. మీరు దాని వినియుందురు. ప్రియుఁడొకడు తనప్రియురాలి యింటికివచ్చి తలుపుతట్టగా "నీవెవరవు?" అని అడుగుటయు "నేనే" అని అతడనుటయు తటస్థించెను. అప్పుడాదరణ జరుగలేదు. అతడు మఱొకసారివచ్చి "నేనే యిక్కడనున్నది" అనెను. అప్పుడును తలుపు తెఱవఁబడలేదు. మూఁడవతడవ వచ్చినప్పుడు "ఎవరక్కడ" అని లోపలినుండి వచ్చు ప్రశ్నకు అతడు "ప్రియురాలా, నీవే నేను" అనగానె తలుపు తెఱవబడెనట. భగవంతునికిని మనకునుఁగల సంబంధము ఇటువంటిది! అతడన్నిటను కలడు; సర్వమును అతడే! ప్రతిస్త్రీయు ప్రతిపురుషుఁడును కేవలానంద స్వరూపుఁడగు బ్రహ్మమే! భగవంతుఁడు అజ్ఞేయుఁడందురా? ఆయనను వెదకి కనుగొనవలయునందురా? ఎల్లప్పుడును మనము భగవంతుని ఎఱిగియేయున్నాము. సదా వానిలోనే వసింపు

చున్నాము; ఎల్లెడల అతడు తెలియ వచ్చుచునే యున్నాడు; నిత్యము పూజలను అందుకొనుచునే యున్నాడు

ఇతర పూజావిధానములును దూష్యములు కావను విషయము ఇంకొకటికలదు. ఈవిషయమును జాగ్రత్తగాజ్ఞప్తి నుంచుకొనవలయును. మనకెంత మోటుగా కనఁబడిననుసరే, వేర్వేఱు తంత్రములు, రూపములు, కల్పించి తద్వారా భగవంతుని పూజించువారు దోషులుకారు. ఒక సత్యమును దాటి మఱొక సత్యమును, క్షుద్రసత్యమును దాటి ఉత్తమతర సత్యమును చేరుటకై నరుఁడు కావించు యాత్రయే యది. చీకటి అనునది అల్పతర ప్రకాశమే; దోషము అనునది అల్పతరగుణమే. అపవిత్రత అనఁగా పవిత్రత తక్కువై తోఁచుట మాత్రమే! మనము దాటివచ్చిన మార్గముననే యితరులు వచ్చుచున్నారు అనుజ్ఞానముతో సానుభూతివహించి ప్రేమదృక్కులతో వారిని ఆదరించుట విధియని సదా మదినుంచుకొనవలయును. నీవుముక్తుఁడవై తివేని, వెనుకముందుగా అందఱును ముక్తులగుదురని తెలిసికొనుము. నీవు ముక్తుఁడవైనచో హీనత నీకు ఎక్కడగోచరించగలదు? నీవు నిజముగా పవిత్రుడవై తివేని నీకుఅపవిత్రమగునవి కనబడుటఎట్లు? నీఅభ్యంతరమున గలదేగదా బాహ్యమున ఉన్నదియును! మనలో దోషములేనిదోషమును గుర్తింపనే లేము. వేదాంతసిద్ధాంతమున అనుష్ఠానాంశములలో ఇది ఒకటి; మనము దీనిని మనజీవితాచరణములందు చొన్పుదుముగాక. మన యీ ఐహికజీవిత మంతయు దీనిని అనుష్ఠించుకొఱకేయని సదా స్మరింతుముగాక. అందువలన మనకు అనుకూలత చేకూరుచున్నది. సత్యస్వరూపమై వెలుగు బ్రహ్మముమనలోపలఉన్నదని దెలిసికొనుటవలన,

అతృప్తితోను, అసంతుష్టితోను, పనిచేయుటకు మారుగా సం తుష్టులమై తృప్తివహించి పాటుపడగల్గుదుము. అసత్యస్వరూప ము మనజన్మ స్వామ్యము. దానిని మనము ప్రకాశమునకు తెచ్చి ప్రస్ఫుటము గావించవలసి యున్నది.

---

# అనుష్ఠాన వేదాంతము

## 3-వ భాగము

నారదుఁడనుఋషి సనత్కుమారుఁడను మహాకఋషి యొద్దకేగి వివిధప్రశ్నము లడుగుచు వస్తుజాలసృష్టికి ఆత్మ మూలము కాఁగలదా? అని ప్రశ్నించినటుల ఛాందోగ్యోప నిషత్తున చదువుదుము. అంతసనత్కుమారుఁడు క్రమక్రమముగ మెట్టుమెట్టుగ నడుపుచు, ఈ భూమికంటె ఉత్తమతరమైనది ఒకటి గలదనియు, దానికంటే ఉత్తమతరమైనది ఇంకొకటి గలదనియు ఇట్లు చెప్పుచుపోవ ఆకాశమనగా ఏమి? అను విచారణదగ్గరకు వత్తురు. ఆకాశము తేజస్సుకంటె ఉత్తమతర మైనది; ఏలయన ఆ ఆకాశమందు సూర్యుఁడు, చంద్రుఁడు, మెఱుపు, నక్షత్రములు; అన్నియు ఉన్నవి. ఆకాశమందే మన ము వసించుచున్నాము; మఱియు ఆ ఆకాకాశమందే మనము లయమగుచున్నాము. అప్పుడు అంతకన్నను ఉత్తమతరమైనది ఏమేని కలదా? అనుప్రశ్న బయలుదేఱ, సనత్కుమారుడు ప్రాణము అనునది కలదనును. వేదాంత సిద్ధాంతానుసారము ప్రాణము చైతన్యము ఒక్కటే. అదియు ఆకాశమువలెసర్వత్ర వ్యాపించియుండు తత్వము. తనువునగాని మఱెక్కడగాని గల

సమస్త చలనమును ప్రాణమువలననే కలుగుచున్నవి. అది ఆకాశముకంటె గొప్పది; దాని ద్వారముననే సమస్తమును జీవించుట. ఈప్రాణము తల్లియందు, తండ్రియందు, సోదరియందు, గురువునందును ఉన్నది. ఈప్రాణము సర్వసాక్షి.

శ్వేతకేతు బ్రహ్మమునుఁగూర్చి తన తండ్రిని ప్రశ్నించి తెలిసికొనిన సందర్భమును మీకు తెలిపెద. తండ్రి వానికి వివిధవిషయములను బోధించి యిట్లు ముగించును. "ఈవస్తుజాలమునకు అంతటిలోఁగల సమవాయకారణము[1] ఏదియో, అదియే వానియొక్క ఉపాదానకారణమును[2] అగుచున్నది, సర్వమును అదియే; అదియే బ్రహ్మము; ఓ శ్వేతకేతు, "తత్వమసి-నీవే అది;" అటునుచు అనేక సాదృశ్యముల తెలుపును. "ఓ శ్వేతకేతు! తేనెటీగ అనేకపుష్పములనుండి తేనెను ప్రోగుచేయును. ఆయా తేనెలు తాము భిన్నభిన్నములగు వృక్షములనుండియు, పుష్పములనుండియు వచ్చినట్లు ఎంచని రీతిని, మనమందఱము ఆ సత్తాకను చేరిన పిమ్మట మనము ఒకప్పుడు వేర్వేఱ యుంటిమని తలచము. ఆమూలతత్వము ఏదియో, అది సర్వమునకు ఆశ్రయమై యదియే సర్వాత్మయై యొప్పును. అదియే సత్యము, అదియేపరమాత్మ, తత్వమసి. ఓ శ్వేతకేతు, నీవేఅది." సముద్రమున వచ్చిచేరు నదుల యుదాహరణను మఱియొక దానినిగూడ దెలుపును. నదులు సముద్రమున చేరినప్పుడు, నేను ఈనదిని, నేను ఆనదిని అని గుర్తించనటుల జీవులు సత్తునుండి వచ్చియు తాము సత్తు

1 అన్నియు ఏర్పడుటకు మూలాధారమైన తత్వము,

2 అని ఏపదార్థముతో ఏర్పడుచున్నవో అని,

నుండి వచ్చినటుల తెలిసికొనకున్నారు. ఓ శ్వేత కేతు,తత్వమసి నీవే అది ఆయన యిట్లే యుపదేశించుచు బోవును.

మనకు జ్ఞానము ద్వివిధముగ కల్గుచున్నది. వ్యష్టిని సామాన్యముతోడను, సామాన్యమును విశ్వము తోడను సంబంధపఱచి పరిశీలించుట ఒక మార్గము. మనము దేనితత్వ మును తెలియగోరుదుమో, సాధ్యమైనంత వఱకు వ్యష్టి త్వేన దాని స్వభావమును మాత్రమే పరిశీలించి వివరణను తేల్చుట రెండవమార్గము. మొదటి పద్ధతిననుసరించినచో, మనజ్ఞానమంతయు వస్తువర్గముల గూర్చుచు, క్రమక్రమముగ సూక్ష్మతరపరిశీలనము చేయుటవలన చేకూడుచున్నది. ఏదేని ప్రత్యేకమై ఒంటిగా సంఘటించినప్పుడు, మనకుఅతృప్తిగల్గును. ఆసంఘటనమే మఱలమఱల గలుగగలదని యెఱింగిన యెడల తృప్తులమై దానిని ప్రకృతిధర్మము అందుము. ఒక్క రేగుపండు మాత్రమే నేలరాలునని గ్రహింపవలసినచో అసంతృప్తికలుగు ను. అన్ని రేగుపండ్లునురాలగలవని తెలిసికొనినయెడల, దానిని "గురుత్వాకర్షణ" ధర్మముఅనిచెప్పుచుసంతుష్టినిపొందుదుము. ఇట్లు వ్యష్టిని ఆధారము చేసికొని సమిష్టిని సాధించుము.

పారమార్థిక ధర్మమునునేర్చునప్పుడు మనముఈశాస్త్ర పద్ధతినిఅనుసరింపవలయును. ఆపద్ధతియేమనకుఇప్పుడు ఉపయో గించగలదు. సర్వత్రయీపద్ధతి అనుసరింపబడుట మనముకాంచ గలము. నేనువీూకు భాషాంతరీకరించిదెలుపుచున్న యీపుస్తక ములను పఠించునప్పుడు, వ్యష్టినుండి సమష్టినిసాధించుట అను ప్రణాళిక ప్రప్రథమమున నాకుగోచరించుచున్నది. సూక్ష్మ

---

వ్యష్టి=ప్రత్యేకింప బడిన ఒకటి

సమష్టి=సముహముగ కూర్చబడినది

వస్తువులన్నియు ఒక్క ప్రధానమునందుఁ కలసిపోవును. ఈసూత్ర మును అనుసరించి యీజగమునుఁగూర్చిన భావనసాగించి, పూర్వులు క్రమక్రమముగ సూక్ష్మతరవిచారణకు కడంగియుండిరి. సూక్ష్మమునుండి సూక్ష్మతరమునకు అనగా అధికతరవ్యాప్తిగల దానికి పోవుచువ్యష్టి వస్తువిచారణమునుండి విశ్వవ్యాప్తమగు ఆకాశమునకును, అందుండి సర్వశక్తులకు కూటమగు ప్రాణమునకును చేరగల్గిరి. ఈపద్ధతియందెల్ల, తక్కినవానికి భిన్నముగా వేఱైయుండునది ఒక్కటియు లేదను సూత్రము గోచరించుచున్నది. ఆకాశమే సూక్ష్మతర రూపమున ప్రాణము అగుచున్నది; అనగా ప్రాణశక్తి స్థూలతరమై ఆకాశమగును; ఆ ఆకాశమింకను స్థూలతర రూపము తాల్చును. ఇట్లే జరుగుచుండును.

సగుణబ్రహ్మమునకు సమష్టిరూపముకల్పించుటకు నొక దృష్టాంతము. ఈసమష్టిభావనయెట్లు చేకూరునో చూచితిమి. అదిమనవిజ్ఞానము అంతటియొక్క పూర్ణరాశి అనవచ్చును. ఇందొకకష్టము చూపట్టుచున్నది. ఈసమీకరణము పూర్తియయినది కాదు. మనము ప్రకృతి విషయములలో ఒక పక్షమును అనగా విజ్ఞానమును మాత్రమేవిచారణకు దీసికొని దానినుండియే సమష్టి భావనను సాధించితిమి. ఇంకను వేఱొక పక్షము మిగిలియున్నది. కావున మొదటిది అసంపూర్ణమగు సమీకరణము. రెండవసిద్ధాంతము నందును కొంతతగులము. నేలరాలిన ప్రతిరేగుపండును ఒకదయ్యముచేత లాగివేయఁబడుచుండెనని వాదించు వారుండియుందురు. ఇప్పుడు దానిని గురుత్వాకర్షణ ధర్మము అని బోధించుచున్నాము. ఈ వివరణయు సంపూర్ణ మయినది కాకున్నను, ఇది మొదటిదానికంటె శ్రేష్ఠతరమైనది.

ఇది వస్తు గుణమునను సరించియే సిద్ధించుచున్నది; రెండవదో బాహ్యకారణమును వేఱొక దానిని తెచ్చిపెట్టుచున్నది. ఇటులనే మనజ్ఞానసాధనయంతయు జఱుగుచున్నది. వస్తుగుణమును మాత్రమే ఆధారముచేసికొని తెలుపు వివరణము శాస్త్రీయము; ఉపరిగా అన్యకారణమును తెచ్చిపెట్టు వివరణము అశాస్త్రీయము.

ఇప్పుడు సగుణబ్రహ్మ ఒకడు జగత్సృష్టి చేయుచుండును అను విషయమును ఈపై విధమున విమర్శింపవలసి యున్నది. ఈసృష్టితో సంబంధము ఏమియు లేక, జగతునకు అతీతుడై యుండి, బ్రహ్మదేవుడు తన యాజ్ఞవలన ఈసృష్టినంతను శూన్యమునుండి కల్పించుచున్న యెడల, అది అశాస్త్రీయసిద్ధాంతమై పోవుచున్నది. యుగయుగములనుండి వచ్చుచున్న సగుణారాధనయందుఁగల లోపమే యిది.

శూన్యమునుండి, తనసంకల్ప మాత్రము చేతనే, జగత్సృష్టిగావించుచు, దానినుండి భిన్నుఁడై, మానవ లక్షణములను అన్నింటిని అనేకమడుంగులు హెచ్చుగాఁగల సగుణబ్రహ్మ కలడను ఏకేశ్వరోపాసన సిద్ధాంతమునందును ఈ రెండులోపములును గాన్పించుచునే యున్నవి. ఇందుమూలమున రెండుబాధకములు గల్గుచున్నవి.

సమీకరణము పూర్తిగా లేదని గ్రహించి యుంటిమి. అదిఒకటి సృష్టినాధారముగఁదీసికొని సృష్టికివివరణము చెప్పుట లేదు. ఇది రెండవది. కార్యమును కారణమును భిన్నములను చున్నాము. కారణమును కార్యముకంటె పూర్తిగ భిన్నమగు నటులఁచేయుచున్నాము. అయినను కారణముయొక్క రూపాంతరమే కార్యమని మానవ విజ్ఞానమంతయు తెలుపుచున్నది.

ఆధునిక ప్రకృతి శాస్త్ర సిద్ధాంతములన్నియు ఈభావమును బలపఱచుచున్నవి. సర్వత్ర అంగీకృతమైన నవ్యతరసిద్ధాంతమగు పరిణామవాదముగలదు. ఫలము కారణముయొక్క వేఱొండు రూపమేయైయున్నది; అనగా కారణము పునర్నిర్మిత మగుచున్నది; అనగా కారణమే కార్యముయొక్క వేషమునుదాల్చుచున్నది; ఇదేలందుప్రధానసూత్రము. ఆధునిక శాస్త్రజ్ఞులు శూన్యమునుండి జగత్తు సృష్టియగుచున్న దనిన నవ్వుదురు.

సరియే. మతము ఈవిమర్శనలకు ఆగగలదా? ఏమత సిద్ధాంతములైనను ఈద్వివిధ పరీక్షలకును తాళిన యెడల వానిని ఆధునిక శాస్త్రవేత్తలును, మనీషావంతులును అంగీకరింపగలరు. ఇందుకు భిన్నములగు సిద్ధాంతములను తెలిపి, వానిని మత విశ్వాసములు, మత గ్రంథములు మత గురువులు శాసించుచుండిరిగాన, మీరు నమ్మడని యిక్కాలపువారిని శాసించినయెడల వారు తిరస్కరించుట తథ్యము. ఇక సహింపరాని అవిశ్వాసము బయలుదేఱును. పైకి విశ్వాసముజూపువారియందును, వారి హృదయములను పరీక్షించి చూచినచో, భయంకరమగు అవిశ్వాసము కానవచ్చును. ఇతరులు మతమనిన వెగటు చెందుదురు; అదిపూజారుల వట్టి గోలయని పరిత్యజింతురు.

మతమునకు ఒకరీతి జాతీయాకృతిగూడ కల్పింప బడినది. అది సర్వమును చెదిరిపోగా నిలిచియున్న యొకసాంఘిక చట్టముగ నున్నది; అట్లేయుండుగాక! పూర్వులకు నిజముగా అవసరమై కనుపడినది యిక్కాలపు వారికి అటులకాకుండ పోయినది. ఆస్థితి వీరి విచక్షణకు సంతృప్తి నిచ్చుటలేదు. ఆసగుణబ్రహ్మ భావనయు, ఆ సృష్టిక్రమమును, అన్ని మత

ములందును చూపట్టు సామాన్యేకేశ్వరోపాసనయు, యిక నిలువజాలవు! హిందూదేశమున నిట్టివి బౌద్ధుల దాడికి ఆగలేక యోడినవి; పూర్వకాలమున బౌద్ధులకుజయముకూర్చినది సరిగా నిదియే! ప్రకృతియందు అనంతశక్తి వెలయుచో, ఆ ప్రకృతి తనకు కావలయుదాని నెల్లఁ గూర్చుకొనజాలినయెడల, ఆ ప్రకృతికి తోడుగా ఇంకొకటి ఏదియోకలదని వాదించుట అనవసరమని వారు రుజువుచేసిరి. ఆత్మయొకటి కలదనుటయు అనవసరమే యనిరి!

పదార్థమునకును దాని గుణములకును గల సంబంధమునుఁగూర్చినచర్చ చాలపురాతనమైనదే. అప్పటి మూఢ విశ్వాసములు నేటికిని నిలిచియుంట కాననగును. గుణములు పదార్థమును అంటియుందునా అనఁగా పొడుగు వెడలుపు దళసరి అను లక్షణములు వస్తువును అంటియుండునా? లేక గుణములున్నను పోయినను గూడ, జడమగు పదార్థము వేఱుగ నిలచియుండఁగలదా? అను విషయమును గూర్చిన చర్చ మాధ్యమికయుగ గ్రంథములందు మీరు కాంచియుందురు. తదనంతరముకూడ ఈ చర్చ యెడతెగక సాగివచ్చుచున్నదని తెలుపుటకు విచారము గల్గుచున్నది. దీనింగూర్చి బౌద్ధులిటుల వాదించుచున్నారు. "ఆరీతిగా పదార్థ మొకటి కలదనుటకు మీకాధారములేదు; ఉండునవి కేవలము గుణములు మాత్రమే. వానిని మించి మీకు దృశ్యమగునది ఏమియునులేదు." ఈకాలమున అజ్ఞేయవాదులును ఇట్లే వక్కాణించుచున్నారు. వస్తువునకును గుణములకును గల యీ జగడమే; సూక్ష్మతరమై వ్యక్తము అవ్యక్తముల వైరముగా పరిణమించుచున్నది. ఇదిగో వ్యక్తమగు ప్రపంచము; ఈ

జగము సంతతవికల్పరాశి ! దీని వెనుక వికల్పరహితమగునది ఏదో గలదనుచు, కొందరు ద్వంద్వము సత్యమనియు, వ్యక్తము అవ్యక్తము అని రెండు కలవనియు అందురు. వీరికంటె బుద్ధిశాలురు బయలుదేరి అటుల రెండు భిన్నవిషయములుండజాలవు; నీవు చూచునది, స్పర్శించునది, భావనచేయునది వ్యక్తమగు విచారరాశిని మాత్రమే అని వాదింతురు. ఈవ్యక్త ప్రపంచమునకు వెనుక ఏమికలదని చెప్పుటకును ఆధారము లేదు అందురు. సులభముగ దీనికి సమాధానము రాదయ్యె. వేదాంతమందలి అద్వైతసిద్ధాంతము మాత్రమే దీనికి సమాధానము చెప్పగలదు. ఒక్కటే ఉండుననుట నిజమే; ఆ ఒక్కటే వ్యక్తముగగాని యవ్యక్తముగగాని యుండగలదు. వికల్పమగునది ఒకటియు, దానిలో దాని ద్వారమున ప్రకాశించుచు నిర్వికల్పమగు మఱొకటియు, యిటుల రెండుకలవనుట అబద్ధము. సత్యమునకు నిర్వికల్పమైయు వికల్పమగుచున్నట్లు చూపట్టునది ఒక్కటి మాత్రమే కలదు. మనము దేహమును, మనస్సును, ఆత్మను భిన్నభిన్నములుగా భావించుచున్నాము; కాని ఉండునది ఒక్కటేసుడీ! ఆ ఒక్కటే యిన్ని రూపముల కాన్పించుచున్నది. అద్వైతులు తెలుపునట్టి త్రాడు పాముగా గన్పడు ఉదాహరణను విచారించుడు. కొందఱు మనుష్యులు చీకటిగానుండుటచేతనో మఱేకారణముచేతనో, త్రాడును చూచి పామనుకొనిరి. నిజస్థితి తెలియవచ్చినప్పుడు పాము అదృశ్యమై త్రాడుమాత్రమే కాన్పించును. మనస్సులో పామున్నప్పుడు త్రాడు అదృశ్యమైనది. పై ఉదాహరణవలన ఇది తెల్లమగుచున్నది. మనము వికల్పప్రకృతిని గాంచి, ఆవికల్పప్రకృతిని మనచుట్టును గుర్తించు తఱిని నిర్వికల్పము

అదృశ్యమగుచున్నది. మనము మార్పులేని నిర్వికల్పతత్వమును గుర్తించునప్పుడు, వికల్పప్రపంచము అంతరించుట సహజముగా నేర్పడునుగదా! దీనివలన ప్రత్యక్ష ప్రమాణవాదము యొక్కయు, ఆదర్శవాదముయొక్కయు తత్వమును బాగుగ గ్రహింపఁ గలుగుచున్నాము. ప్రత్యక్ష ప్రమాణవాది వికల్ప ప్రకృతిని మాత్రమే చూడగలడు. ఆదర్శవాది నిర్వికల్పమును మాత్రమె చూచును. ఆదర్శవాది, అనగా అనుభవజ్ఞుఁడగు ఆదర్శవాది నిజముగా తత్వదృష్టిని సాధించి వికల్పముం గూర్చిన భావనలను అన్నింటిని తొలగించుకొనగలుగును. ఆతనికి మాత్రమే వికల్పప్రపంచము అదృశ్యముకాగలదు. అతఁడుమాత్రమే యిదెల్లవట్టిభ్రాంతి, వికల్ప ప్రపంచము అనునదే లేదు అనగలుగును. ప్రత్యక్షప్రమాణవాది వికల్ప ప్రపంచమును మాత్రమే చూడఁజాలును. వానికి అవ్యక్తము గోచరమేకాదు. అతనికి ఇదంతయు సత్యమే యని పలుకు అధికారము గలదు.

ఈ తత్వశాస్త్రము వలన చేకూరిన ఫలితార్థమేమిటి? సగుణబ్రహ్మోపాసన అసమగ్రము కాదనుచో! దానిని దాటి ఉత్తమతరమైన నిర్గుణభావమును సాధించవలయును. అదే మనము అనుసరించదగిన వివేకమార్గము. ఇట్లనుటచేత సగుణబ్రహ్మభావమును నాశముచేయుటగాదు. సగుణబ్రహ్మ లేడని రుజువుచేయఁజూచుటగాదు. సగుణ భావమును చక్కగ విశదీకరించుటకు నిర్గుణతత్వమును ఆశ్రయించవలయును. నిర్గుణ భావమువలన, సగుణ భావమువలన లభించు శమీకరణముకంటె ఉత్తమతరమగు ఫలము చేకూరుచున్నది. నిర్గుణ మనంతమై వెలుంగగలదు. సగుణము పరిమితంబై యొప్పును. ఈవిధముగా మనము సగుణభావమును నిలువబెట్టుదుమేగాని, రూపు

మూపము. నిర్గుణబ్రహ్మమును ఉపాసించుటచేత సగుణబ్రహ్మ భావమునకు భంగము వచ్చుననియు, నరుని నిర్గుణత్వమును గ్రహించిన యెడల సగుణభావము నశించుననియు తఱచుగా శంకించుచుందుము. కాని వేదాంతోద్దేశ్యము వ్యష్టిని నాశము గావించుటగాదు. అందుకుమారుగా దాని నిజస్వరూపమును సంరక్షించుటే. సమష్టిని ఆశ్రయించినతప్ప మనము వ్యష్టిని రుజువు చేయజాలము. వ్యష్టిగా కాన్పించునది నిజముగా సమష్టియే అని రుజువు చేయుటవలననే అది సాధ్యము కాఁగలదు. వ్యష్టిని ప్రకృతిలోని ప్రతిదానినుండియు వేరుచేసినయెడల అది క్షణకాలమేని నిలువజాలదు. అటువంటి వ్యష్టి ఎన్నడును లేనే లేదు. మఱియు ఒక వస్తుతత్వము దాని సహజలక్షణము నుండియే వివరింపఁబడవలయునను రెండవ సూత్రప్రయోగము వలన, నింకను గంభీరతరభావనను చేరగలము. దీనిని గ్రహించుట చాల కష్టము. అత్యుత్తమ సమీకరణమగు నిర్గుణ బ్రహ్మము మనలోనేయున్నది. మనమే అది. ఇంతకు మించినది ఇసుమంతయులేదు "ఓ శ్వేతకేతూ, తత్వమసి, నీవే అది, నీవే ఆ నిర్గుణబ్రహ్మము. నీవు జగమంతటను ఎవని వెదకు చుంటివో ఆ భగవంతుడు సైతము నీవే" ఇట్లు నీవేయనుట, సగుణభావముతో కాజాలదు. నిర్గుణభావముతో మాత్రమే అట్లనదగును సుమీ! ఇప్పుడు మనము గుర్తించు నరుఁడు అనఁగా వ్యక్తరూపుఁడగు నరుడు సగుణరూపము నందిన నిర్గుణమూర్తియే సుమీ. ఈ సగుణరూపమును అర్థముచేసి కొనుటకు నిర్గుణవిచారము చేయవలయును. వ్యష్టిని సమష్టి సంబంధము గల్పించి పరిశీలింప వలసియుండును. నిర్గుణతత్వమే సత్యమైనది. అదే నరుని ఆత్మ.

ఈ విషయమును గూర్చి అనేక సంశయములు పుట్ట గలవు. క్రమక్రమముగా వానికి సమాధానములు తెలుప యత్నింతును. చాల కష్టసమస్యలు బయలుదేరగలవు. మొట్ట మొదట అద్వైతాదర్శమును చక్కగ గ్రహింపుదుముగాక. వ్యక్తజీవుల రూపమున మనము వేఱువేఱుగా గాన్పించినను సత్యముగ ఏకమే. ఆ యేకత్వమును విడిచి వేఱువేఱనుకొను టను ఎంతగా మన భావమునుండి తొలగించిన అంత శ్రేయము. పరిపూర్ణమునుండి మనము ఎంత దూరస్థులముగా ఎంచుకొం దుమో, అంత క్లేశమును అనుభవింతుము. ఈ అద్వైత సిద్ధాం తమువలన సమస్త నీతిధర్మమునకును పునాది లభించుచున్నది. ఇంక దేనివలనను మన నీతివర్తనకు ఆధారము చేకూరదని నా నిశ్చితాభిప్రాయము. ఎదో ఒక దేవునియొక్కగాని, దేవ తలయొక్కగాని యిచ్ఛయే ధర్మము అను కడు పురాతన భావము కలదు. కాని దీనివలన అసంపూర్ణమగు సమీకర ణము మాత్రమే లభింపఁగలదు. కాన ఇప్పుడు దాని నెవరును అంగీకరింపఁబోరు. వేదములు అటుల చెప్పుచున్నవి గాన మేము ఇది చేయరాదు, అది చేయరాదు, అని హిందువు లందురు; కాని వేదములు ప్రమాణములని క్రైస్తవులు ఒప్పు కొనరు. బైబులు శాసించుచున్నది, గాన మనము ఇది చేయ దగును, అది చేయదగదు అని క్రైస్తవు లందరు. బైబులు నందు విశ్వాసము లేనివారిని ఈ నియమము బాధింపదు. ఇట్టిభిన్నాభిప్రాయములను అన్నింటిని లోఁబఱచుకొనుటకుసమ ర్థమగు విశాలతర సిద్ధాంతము మనకు కావలసియున్నది. సగుణ బ్రహ్మయందు విశ్వాస ముంచువారు లక్షలకొలంది యున్నను, ఈ సగుణభావన సంకుచితమైనదనియు, ఇంతకంటె

సూక్ష్మతరమై తమ అంగీకారము బడయఁగలది ఇంకొకటి కావలయుననియు వాదించువారు లోకములోని మేధాసంపన్నులలో వేలకొలంది కలరు. ఇట్టిభావములు కలవారిని అందఱిని కూడగట్టుకొనుటకు తగినంత విశాలమైనదై మతము ఒప్పనియెడల సంఘమందలి అత్యంత మనీషావంతులు మతమునకు దూరముగనే ఉండిపోవలసినవారగుదురు. ఈ కాలములో, ముఖ్యముగా యూరపునందు ఈస్థితి ప్రస్ఫుటముగా వెల్లడి ఐయేయున్నది.

ఇటువంటి భావములు గలవారిని అందఱను కలుపుకొని వచ్చుటకు మతము తగినంత విశాలముగా నుండవలయును. దాని సిద్ధాంతము లన్నియు వివేకపరిశీలనకు నిలువగలవిగా నుండవలయును. మతసిద్ధాంతములను తర్కసూత్రములచే విమర్శింప తగదను టేలనో ఎవరికిని తెలియదు. తర్కసూత్రముల సాహాయ్యమును విడిచితిమా, మతవిషయములందు సయితము నిర్దుష్టములగు పరిష్కారములు లభింపజాలవు. ఒక మతము మహానీచవిషయమును దేనినేని శాసించును అనుకొనుడు. ఉదాహరణకు కొందఱు మహమ్మదీయ మతస్థులు ఆ మతస్థులు కానివారి నెల్ల చంపుట ధర్మమందురు. "మహమ్మదీయులు కానివారిని వధింపుఁడు" అని ఖురానులో స్పష్టముగ నున్నదట. మతాంతరులను దగ్ధము కావింపవలసినదే; ఖడ్గమునకు ఎఱ చేయవలసినదే! అట్లను మహమ్మదీయులతో మీరు చేయునది తప్పనినయెడల, "నీకేమి తెలియును? దాని వలన మేలుకలుగదని నీ వెట్లుచెప్పగలవు? మా గ్రంథము అటుల శాసించుచున్నది" అనఁగలరు. క్రైస్తవులు ఒకవేళ మా పుస్తకము ఇంకను పురాతనమైనది అందులేని,

అప్పుడు బౌద్ధులు మాపుస్తకము మఱింకను ప్రాచీనమైనది అందురు. హిందువులు వచ్చి మాగ్రంథములు అన్నింటి కంటెను మిగుల ప్రాచీనములని వాదింతురు. కాబట్టి గ్రంథములు ప్రమాణికములనుట ఒప్పదు. ఒండొంటిని పోల్చి చూచుటకు ఇక ఆధారమేమి? మాపర్వతోపదేశముగాంచుడు అని క్రైస్తవు లందురు. మా ఖురానుధర్మమును చూడుడు అని మహమ్మదీయుఁడనును. ఈ రెండింటిలో ఉత్తమతరమగు నది ఏదియో తేల్పఁగలవాడెవడని మహమ్మదీయుఁడు మిమ్ము డుగఁ గలడు. మీమధ్య తగవు దీర్చుటకు నూతన నిబంధన (బైబులు)గాని ఖురానుగాని ఉపకరింపఁజాలదు. స్వతంత్ర మగు ప్రమాణమొకటి అవసరము. అది ఏపుస్తకముగనుఉండఁ జాలదు. అది సర్వజనాదరణీయముగ నుండవలయును. తర్కమును మించి యేది అట్లు సర్వజనామోదమును పడయ గలదు? తర్కము సయితము పూర్ణముగ సమర్థమైనది కాదందురు. 'అది సదా సత్యమునే తేల్పఁగలదను నమ్మకము లేదు. అది తఱచుగ పొఱబడుచునే యుండును. కాఁబట్టి మనమొక చర్చియొక్క (మతపీఠముయొక్క) అధికారమునకు ఒడంబడ వలసియున్నది'-ఇట్లొక రోమనుకాతలిక్కు మతస్థుఁడు నాతో వాదించినాఁడు. వాని తర్కము నాకుబోధపడ లేదు. నేను చెప్పునది ఏమన, తర్కము దుర్బలమైనప్పుడు కొందఱు చేరిన బోధకుల కూటమును మరింత దుర్బలమైనదే అగును. వారు చేయు పరిష్కారమునకు ఒడంబడుటకన్న నాతర్కమునే నేను నమ్ముకొందును. అదెంతదుర్బలమైనను,దానిని నమ్ముకొని నచో నేను ఎప్పటికైన సత్యమును గ్రహింపఁజాలు అవకాశ ముండును. తదితర మార్గములందో అట్టిఅవకాశమే లేదుగదా!

మనము తర్కమును ఆధారముచేసికొన వలసినదే; తర్కమును అనుసరించి విశ్వాసమును కుదుర్చుకొనఁ జాలము అను వారినిఁ గూర్చి మనము జాలిపడవలసినదే! ఎవరి మాటనో ప్రమాణముగా అంగీకరించి రెండుకోట్ల దేవతలు కలరని గ్రుడ్డినమ్మకమును వహించుటకన్న తర్కమును ఆధారముచేసికొని, నాస్తికులై పోవుటే మానవజాతికి శ్రేయస్కరమగును! మనకుకావలసినది అభివృద్ధి, పురోగమనము, బ్రహ్మసాక్షాత్కారము! కేవలసిద్ధాంతములు ఎన్నఁడును మానవులను ఉద్ధరించి యుండలేదు. ఎన్నిపుస్తకము లున్నను మనను పవిత్రవంతులనుగ చేయఁజాలవు. ఆత్మసాక్షాత్కారమే ఏకైక మార్గము. అది మనయందే యున్నది. జిజ్ఞాసచేత అది సిద్ధించును. నరులు సమాలోచన చేయవలయును. మట్టిముద్ద యెన్నఁడును యోచనచేయఁజాలదు. కావున అది సదా మట్టిముద్దగనే యుండిపోవును. ఆలోచనాపరుఁడు కాఁగలుగుటే నరుని ఘనత! యోచనచేయుట నరుని స్వభావము, ఇదే వారికిని పశువునకునుఁగల భేదమును చూపునది! ఊరక ప్రమాణములపైని ఆధారపడుట మితిమీరిపోయిన దేశమున పుట్టినవాఁడనై, అట్టి ప్రమాణములవలన చేకూరు అనర్థములనుఁచక్కగ గ్రహించినవాడనగుటచేత, నేను తర్కమునందు విశ్వాసముంచి, తర్కమును అనుసరింపగోరుచున్నాను.

వేదములలోనుండి సృష్టి బయలుదేరుచున్నదని విశ్వసించు హిందువులుకలరు. ఆవు అనునది ఉన్నదని నీకెట్లు తెలియును? అనిన, గోవనుశబ్దము వేదములలో కలదుగాన, అనివీరందురు! వెలుపల ఒక మనుష్యుఁడున్నట్లు నీకేవిధ

మున తెలిసినది అనినచో వేదములో మనుష్యుఁడను మాట యుండుటచేత అందురు. వారి వాదము అట్లుండును! వారి యెడ గ్రంథప్రమాణభక్తి మితిమీరిపోయినది! వేదమును నేనుఁ చదివినటుల వారు చదువరు, కాని కొందరు మేధా సంపన్నులు దానిని పఠించి, తర్కించి, దాని ననుసరించి, మహాసిద్ధాంతములను కొన్నింటిని కూర్చియున్నారు సుడీ! వారు దానిని చక్కఁగా తర్కించినారు. అందుకు ఫలముగా మహాతత్వశాస్త్రము వెలువడినది. వేలకొలది మనీషాగ్ర గణ్యులు వేలకొలది సంవత్సరములుగా పాటుపడి ఈతత్వ శాస్త్రమును నిర్మించియుండిరి. కేవలము గ్రంథప్రమాణముల పైని ఆధారపడుటవలన అనర్థములు చాలఁగలవు. దానివలన మానవజాతి అభివృద్ధి సంకుచితమైపోవును. మనము పురోభి వృద్ధిని కాంక్షించువారమను విషయము ఎన్నడును మఱవ దగదు. పరమార్థసత్యాన్వేషణమందు కంటెను వ్యావహారిక సత్యమునందును బుద్ధికి వ్యవసాయము అవసరము. బుద్ధివ్యవ సాయమే మన ఆయువుపట్టు.

మీ రెన్ని మతసిద్ధాంతములనైనను విచారించుడు. మీరు ఊహింపజాలు సిద్ధాంతము లన్నిటిలోను అద్వైత సిద్ధాంతము అత్యంతము తర్కవిమర్శనకు నిలుఁవగలది. అదియే దాని ఘనత! ఇతర సిద్ధాంతము లేవియు అనగా, భగవంతునిఁ గూర్చిన అసంపూర్ణములును అల్పములును సగుణములు నగు భావనలు ఏవియు, తర్కపరీక్షకు నిలువఁ జాలవు. అయినను ఈ అసంపూర్ణభావనలు విశేషజనులకు అవసరములే అగుటను అంగీకరించి, అద్వైతసిద్ధాంతము ఈ భావనలను అన్నింటిని తనలో ఇముడ్చుకొనుటచేత మహా

మాధుర్యమై తేజరిల్లుచున్నది. ఈసగుణభావము తర్కపరీక్షకు ఆగదుగదాయని కొందఱు అనబోదురు. కాని దానివలన హృదయశాంతి లభింపఁగలదు సుడీ. అనేకులకు అటువంటి హృదయశాంతిని ఒసగు మతము కావలసియున్నది. వారికి అట్టిది ఉండి తీరవలయునని మనము గ్రహింపఁగలము. సత్యముయొక్క దివ్యతేజమును భరింపగలవారు ఈలోకమున అరిది. దానిని అనుసరించి జీవించు వారు ఇంకను తక్కువ. కాఁబట్టి శాంతిప్రదమగు ఈ సగుణారాధన నిలిచియుండుట అవసరమే; అది చాలమందికి క్రమోన్నతి పొందుటలో తోడ్పడఁగలదు. సంకుచిత దృష్టిగల్గి, స్వల్పబుద్ధులై, స్వల్ప విషయముల కూర్చుకొనుచు సాగిపోవువారు అత్యున్నత భావములను ఒక్కసారిగా స్వీకరింప సాహసింపరు. క్షుద్రదేవతలు విగ్రహములు మున్నగువాని భావనలతో సగుణారాధన కూడియున్నను అవి వారికి అర్థములే! నమస్కారములే యగును. మీరు మాత్రము ఈ నిర్గుణతత్వమును తెలిసికొనవలసియున్నది. ఏలయన దీనిద్వారమునఁగాని తదితర సిద్ధాంతములకు వివరణము లభింపఁజాలదు. ఉదాహరణకు సగుణోపాసనను తీసికొనుడు. జాను స్టూ అర్టు మిల్లువంటి మహాతత్వజ్ఞుఁడొకడు నిర్గుణము అనిన గ్రహించి, దృఢవిశ్వాసమును కుదుర్చుకొనఁజాలును. అతడు 'సగుణబ్రహ్మయుంట అసంభవము. రుజువు చూపుట పొసగదు' అని వాదింపవచ్చును. సగుణబ్రహ్మను రుజువుచేయుట పొసగదని అట్టివానితో నేనును ఒడంబడెదను. కాని నిర్గుణతత్వమును గూర్చి సామాన్యమానవుని బుద్ధి గ్రహింపఁజాలునట్టి మహోన్నత స్వరూపమే ఈ సగుణబ్రహ్మ! నిర్గుణతత్వమును గూర్చిన భిన్న

భిన్నములగు భావములరాశియే కదా ఈ జగత్తు! కాక వేఱేమున్నది? సృష్టియంతయు ఒక మహాగ్రంథము; ప్రతి వాడును తన తెలివితేటల ననుసరించి దానిని పఠించు చున్నాడు. మఱియు ప్రతివాడును దీనిని తనంతట తాను చదువుకొనవలసి యున్నది. మానవులందరి బుద్ధులకును సర్వ సామాన్యమగునది ఏదియో యొకటి యున్నట్లు తోచు చున్నది. అందువలన మానవజాతి అందరిబుద్ధికిని కొన్ని విష యములు ఒకేరీతిని కాన్పించుచున్నవి. మీరును నేనును కురి చీని ఒకేరీతిని ఉన్నట్లు కనుకొనుటచేత మన మనస్సులన్ని టికి సామాన్యమై వెలయునది ఏదియో ఒకటి కలదని తెలి యును. మన యింద్రియములకు భిన్నముగానుండు ఇంద్రియ ముగల పురుషుఁ డొకడు వచ్చును అనుకొనుడు; వానికి ఈ కురిచీ యిటుల కాన్పించదు. కాని వానివలెనుండువారి కంద ఱకును మాత్రము ఈ కురిచీ ఒకేరీతిని గాన్పింపఁగలదు. ఈ జగత్తు నిర్గుణము; మార్పు జెందక నిర్వికారముగా ఉన్నది. అందు చూపట్టు వికారములన్నియు చూచువారిలోని భేద ములను అనుసరించి కానవచ్చుచున్నవి. ఒకే గ్రంథము యొక్క పాఠాంతరములవలె ఉన్నవి. ఏలయందురా ఈవికా రముల (మార్పుల) న్నియు పరమేయములని మీ రంగీక రింతురుగదా. మనము చూడఁగలట్టియు, అనుభవించగల ట్టియు, ఊహించఁగలట్టియు వికారములన్నియు పరిమితి గలవైయే ఉండును. మన జ్ఞానముచేత వానికి పరిమితి కల్పితమగుచున్నది. మనము భావనచేయు సగుణబ్రహ్మయు నిజముచేత అట్టి కల్పితమే! ఒక జగద్వికారమే. నిమిత్త భావము సవికారప్రపంచమున మాత్రమే సంభవమగును.

ఈజగత్తునకు నిమిత్తమైయొప్పు బ్రహ్మను పరిమితునిగానె భావింపవలసియుండును. అయినను ఈతడా నిర్గుణబ్రహ్మమే! మనము ఇదివఱకే గ్రహించియున్నటుల, ఈజగత్తు మన బుద్ధిచేతఁ పఠింపఁబడు నిర్గుణతత్వముయొక్క పాఠాంతరమే గదా! ఈ జగత్తున సత్యమై యొప్పునది ఆ నిర్గుణబ్రహ్మమే! ఈరూపములు, ఈభావనలు అన్నియు దానియందు మన మేదస్సుచేత ఆరోపించబడుచున్న వే సుడీ!

ఈ బల్లయందు శాశ్వతమైయొప్పునది బ్రహ్మము! ఈబల్ల ఆకారము మున్నగు రూపములన్నియు దానియందు మన బుద్ధిచేత కల్పింపఁబడునవే.

ఇందుకు తార్కాణముగా చలనమును చూడుదము. ఇది విచారప్రపంచముతో సంబంధము వీడి యుండజాలదు. పరిపూర్ణమును వీడి అది చలించునన లేము గదా! ఈజగత్తులో గల ప్రతిభాగమును, ప్రతి అణువును నిరంతర వికారమును పొందుచు చలించుచున్నది. కాని విశ్వమంతయు సమష్టిని నిర్వికారమే అనవలయును; ఏలయందురా చలనము, మార్పు అనువానికి అన్యసంబంధము విధిగానుండి తీరవలయును. కేవలము చలనరహితమగు సమష్టియొక్క ఊహను ఆధారముగ గొనినది చలనముయొక్క భావనను సాధింపలేము. చలనము అనఁగా అర్థముచేసికొనుటకు రెండు వస్తువులున్నటుల అంగీకరింపవలయును. విశ్వమును అంతటిని ఒక్క ముద్దగా భావన చేసితిమేని, అది కదలలేదు. అది దేని దగ్గరనుండి దేనికడకు జరుగగలదు? అది ఏదేని వికల్పము చెందుననుటకును వీలు లేదు. ఏవిషయమును అనుసరించి దానిమార్పు? కావున

---

దేనికేని మూలముగా నుండదగిన కారణమును గూర్చిన భావము.

పరిపూర్ణము నిర్వికల్పముగ నుండవలెను. కాని దానిలోప లనో ప్రతి అణువును సంతతము చలించుచు వికారమును పొందుచుండనగును. ఇట్లు పరిపూర్ణమగు విశ్వము నిర్వికారమును సవికారమును అగుచున్నది. నిర్గుణమును సగుణమును గూడ అగుచున్నది. విశ్వము, చలనము, బ్రహ్మ మొదలగు వానింగూర్చిన మన భావమిది. "తత్వమసి" నీవే అది, అనుట కర్థమిదే. ఇట్లు నిర్గుణము సగుణమును పరిత్యజింప కుండగనే మన తర్కము మన హృదయము అసంతుష్టి పడని విధమున వివరించి బోధించుచున్నది. సగుణ బ్రహ్మయు, ఇంక మన మీ జగత్తునకాంచు సర్వమును, మన మనస్సు ద్వారమున చూడబడు నిర్గుణ బ్రహ్మమే సుడీ. మనము వ్యష్టిత్వ భావములను, మన మనస్సులను దాటగలిగినప్పుడు మన మా నిర్గుణ బ్రహ్మముతో ఐక్యముఁ కాగలము. తత్వమసి అనుటకు అర్థమిదియే! మనయొక్క సత్యస్వభావమగు నిర్గుణతత్వమును మనము తెలిసికొనవలసి యున్నది.

పరిమితుఁడైన వ్యక్తినరుఁడు తన మూలస్థానమును మఱచి, తాను పూర్తిగ వేఱగు ఒక ప్రత్యేకవ్యక్తినని భ్రమించుచున్నాఁడు సగుణులమై, వ్యష్టి నరులముగా వర్తించు మనము మన నిజతత్వమును మఱచుచున్నాము. అద్వైతబోధ అనగా వ్యష్టిత్వబోధలను అన్నింటిని విసర్జించుమనుటయుఁ కాదు. వాని నిజతత్వమును గ్రహించు విధమును బోధించుటే! సత్యస్వరూపమున మనము నిర్గుణబ్రహ్మమే. వ్యష్టిరూపజాలము అంతయు ఆ నిర్గుణబ్రహ్మము తాల్చు రూపాంతరముల ప్రదర్శనమే. జగమునపఱుగుపరిణామపరంపరకు అంతకు మూలము మన ఆత్మ తన అనంతశక్తిని క్రమక్రమ

ముగా ప్రకటించు ప్రయత్నమే. పరిపూర్ణముయొక్క యీవలి యొడ్డున ఎక్కడను మనము ఆగిపోఁజాలము. మన బలము, మన ఆనందము, మన జ్ఞానము, అపరిపూర్ణమున లీనమగు వఱకును, పురోగమనము సాగిపోవలసినదే. పూర్ణ సచ్చిదానంద లక్షణములు సదా మనయందు ఉండియేయున్నవి. వానిని ప్రకటించుటే మనము చేయవలసిన పని.

అద్వైతవాదమున మూల సిద్ధాంతము ఇది! ఇది అర్థమగుట చాలకష్టము నా చిన్నతనమునుండి నాచుట్టునున్నవారెల్లరును నాకు దుర్బలతను నేర్పియుండిరి; పుట్టినది ఆదిగా శక్తిహీనుఁడనను మాటనే నాకు నేర్పిరి. ఇప్పుడు నాశక్తిని నేను గుర్తింపలయుననిన చాలకష్టతరముగా కాన్పించుచున్నది. కాని పరిశోధనవలనను, తర్కమువలనను, నాబలము నాకు తెలియవచ్చుచున్నది. నేను దానిని గుర్తించుచున్నాను. మనకు ఈప్రపంచమున లభించు జ్ఞానమంతయు ఎందుండివచ్చుచున్నది? అది మనయందేయున్నది. మనకు వెలిగా జ్ఞానమేమికలదు? ఇసుమంతయులేదు. జ్ఞానము జడపదార్థముకాదు. అది సదా నరునందే యున్నది. జ్ఞానమును సృష్టింపఁజాలినవాఁడెవఁడునులేడు; నరుడు దానిని తనలోపలినుండి వెలికి ప్రసరింప చేయుచున్నాడు. అది వానియందు నిద్రించుచున్నది. ఎన్నియెకరాల నేలనో ఆవరించు గొప్పమఱ్ఱిచెట్టు పూర్తిగా నలుసంత బీజమున ఇమిడియున్నది. దాని మహాశక్తియంతయు అందు అడఁగియున్నది. మహా మేధాసంపద అంతయు అత్యల్ప జీవకణమునందు ముడుచుకొని నిద్రించుచుండఁగా అనంతశక్తి యేలయుండరాదు? అదట్లున్నదని మన మెరుగుదుము. ఈపలుకు

విరోధాభాసముగ గూపట్టవచ్చును; కాని ఆమాట సత్యమే! మనలో ప్రతివాడును చిన్న జీవకణమునుండి వచ్చుచున్నాడు; మనశక్తులన్నియు అందు చుట్టచుట్టుకొని నిద్రించుచున్నవి. మనము తిను ఆహారము ద్వారమున అవి వచ్చుచున్నవని మీరనజాలరు. అన్నమును తెచ్చి కొండలంత యెత్తు గుట్టలు వేసి చూడుడు, అందుండి రాగల శక్తి యేముండును? అవ్యక్తముగా దానిలో శక్తి యుండవచ్చును. కాని అదట్లుండ వలసినదే. అటులనే అనంతశక్తి నరుని ఆత్మయందు ఉన్నది. దానిని అతడు తెలిసికొనవచ్చును; లేకపోవచ్చును. దానిని గుర్తించునప్పుడే అది ప్రకాశమునకు రాగలదు. ఈమహాభూతము కడు మందగతితో మేలుకొనుచున్నది అనదగును. నెమ్మదినెమ్మదిగా తన శక్తిని గ్రహించుచున్నది. జవమును కూర్చుకొనుచున్నది. అజ్ఞానము వృద్ధియైనకొలదిని క్రమక్రమముగా బంధనలు తెగిపోగలవు. గొలుసులు పటాపటలములగును; తన బలమును తన వివేకమును పూర్ణముగ తెలిసికొని ఈ భూతము గంతువేసి నిలిచి ధైర్యసాహసముల ప్రచారముచేయు తరుణము తప్పకరాగలదు. ఆశుభలగ్నము వేగిరము వచ్చునటుల మనమంతయును తోడ్పడుదముగాక!



# అనుష్ఠాన వేదాంతము

## ౪-వ భాగము.

ఇంతవఱకును మనము సమష్టి విచారణ సలుపుచుంటిమి. వ్యష్టికిని సమష్టికిని గల సంబంధమును గూర్చి వేదాంత సిద్ధాంతమున గల భావములను ఈ యుదయమున తెలిపెదను. వేదములందు ద్వైతబోధలు కలవనియు, వాని ప్రారంభమునందు ప్రతివ్యష్టికి ఒక్కొక్క సంకుచితాత్మ ఉన్నటుల స్పష్టముగా వచింపఁబడియుండుటయును తెలిసికొనియున్నాము. ప్రతివానియందును ఉండు ఈ ప్రత్యగాత్మను గూర్చి అనేక సిద్ధాంతములు కలవు. వానిలో ప్రధానమైనవి వేదాంతులకును బౌద్ధులకును జరిగిన చర్చాంశములై పఱగినవి. ప్రతివ్యష్టియందును సంపూర్ణమైన ప్రత్యగాత్మ కలదని వేదాంతులు వాదించిరి. అటువంటి ప్రత్యగాత్మ యెంతమాత్రమును లేనేలేదని బౌద్ధులు వాదించిరి. ఈ వివాదము చాలవఱకు 'వస్తువు' 'గుణము' వీనిభేదమును గూర్చి యూరోపున జరిగిన వివాదమువంటిదేయని యిదివఱకే తెల్పియుంటిని. ఒక వర్గమువారు గుణములకు వెనుక పదార్థ మొకటి (మూలప్రకృతి) కలదు; దానినంటి గుణములు వరలుచున్నవి అందురు. రెండవవర్గము వారో అట్టి పదార్థము (మూలప్రకృతి) కలదనుటకు అవసరమే లేదనియు, గుణములు తమంతట తాము స్వతంత్రముగ నిలువగలవనియు ప్రతివాదము సల్పుదురు. ఆత్మనుగూర్చిన బహు పురాతన సిద్ధాంతము "అహమస్మి" నేనున్నాను అను ప్రత్యక్ష స్వతంత్రజ్ఞానముపై ఆధారపడి యున్నది. నిన్నటి "నేను" నేటి "నేను" నేటి 'నేనే' రేపటి "నేను" అసదగును. శరీరమునకు ఎన్ని వికారములు (మార్పులు) వాటిల్లినను,

"నేను" సదా ఒక్కటిగనే నిలిచి యుండుననని నాకు విశ్వాసము కలదు. ప్రకాశమున పరిమితంబైనను, సంపూర్ణ మగు నొక ప్రత్యగాత్మ ఉన్నదని విశ్వసించు వాదము ఈ లీల నుండును.

దీనిని ఖండించి, ప్రాచీనబౌద్ధులు అట్టి ఊహాకు అగ త్యమే లేదనిరి. మనము గ్రహించునదెల్లను, గ్రహింపఁజాలు నది సమస్తమును కేవలము వికారపుంజమునే (గుణరాశినే) అని వాదించిరి. నిర్వికారమై నిర్వికల్పముగ నుండు పదార్థము (మూలప్రకృతి) ఒకటి కలదనుట అనవసరము. మరియు అటు వంటి నిర్వికారపదార్థము ఏదేని ఉన్నను మనము దానిని గ్రహింపఁ జాలము. దానిని గూర్చి యెట్టి జ్ఞానమును మనకు కలుగఁబోదు. సరిగా దీనిబోలు వివాదమే యిప్పుడు యూరపు ఖండమున, మత ధర్మవాదులును, ఆదర్శవాదులును చేరి ఒక్క పక్షమునను, ప్రత్యక్ష ప్రామాణికులును అజ్ఞేయవాదు లును చేరి రెండవపక్షమునను, నిలిచి సాగించుచున్నారు. ఒక పక్షమువారు నిర్వికల్పముగు ఏదో ఒకటి యున్నదని నమ్ముదురు. (నవీనులలో "హెర్బర్టు స్పెన్సరు" వారి ప్రతి నిధి). వీరు ఆ నిర్వికల్పపదార్థము లీలగా మాత్రము గోచ రింపగలదని వాదింతురు. రెండవపక్షమున "కాంటు" గారి శిష్యులును నేటి అజ్ఞేయవాదులును వహించిరి. హెర్బర్టుస్పెన్స రుగారికిని ఫ్రేడరిక్ హారిసనుగారికిని కొలది వత్సరముల క్రిందట జరిగిన వాదమును గమనించినవారు పూర్వపువారిని ఎదుర్కొనిన ప్రతిబంధకముననే మఱల గుర్తించియుందురు. ఒకపక్షమువారు ఈ వికార ప్రకృతికి వెనుక ఏదో నిర్వికార మూలప్రకృతి కలదందురు, రెండవవారు అట్టియూహా అనవసర

మందురు. ఒకపక్షమువారు నిర్వికల్పమగు ఒకటికలదనిభావన చేయనిదియే వికారమును గుర్తించుట అసంభవమందురు. రెండవ పక్షమువారో అట్టిభావన అనవసరము, మనము చూడ గలది వికారియుక్తమగు దానినే! వికారమునొందని దానిని మనము చూడలేము, స్పర్శింపలేము, అది మనకు గోచరమే కాదు; అందురు.

భారతదేశమునందును అత్యంత ప్రాచీనకాలమున ఈ సమస్య పరిష్కారము కాలేదు. 'గుణముల'కు వెనుకదాని, ఆ "గుణముల"కు అతీతమగు పదార్థము ఒకటికలదని రుజువు చేయుట అసంభవము. ఇంతే కాదు; నేను అను జ్ఞానముపైని ఆధారపడి, అనగా నా 'స్మృతి' అను దానిని ఆధారముచేసి కొని, నిన్నటి "నేనే" నేటి "నేను" అనియు; కాబట్టి నిత్య జీవిగా "నేను" ఉంటున్నాను అనియు చెప్పు వాదనను రుజువు చూపి సమర్థింప వీలులేదు. కొల్లబొల్లివాదనను ఇంకొకదానిని తెలుపుదురు. అదియును అర్థశూన్యమగు వాగాడంబరమే. "నేను చేయుచున్నాను", "నేనునడచుచున్నాను", "నేను కల గనుచున్నాను", "నేనునిద్రించుచున్నాను", "నేను కదలు చున్నాను" అను ఇట్టివాక్యపరంపరను ఉదహరింపవచ్చును. ఇక్కడ చేయుట, నడచుట, కలగనుట, నిద్రించుట అనునవి అన్నియును మారుచునే యున్నవి అని వాదింపవచ్చును. కాని "నేను"అనునది స్థిరముగా నిలిచియున్నది అని వక్కాణింతురు. కాబట్టి "నేను" అనునది స్థిరముగా ఉన్నదనియు స్వతంత్రమగు వ్యక్తియనియు, ఇక మార్పులన్నియు శరీర

స్మృతి=జ్ఞప్తి, పూర్వము జరిగినట్లు గ్రహించిన విషయమును గూర్చి ఇప్పుడు కలుగు జ్ఞానము.

సంబద్ధమైనవనియు వీరు నిర్ధరించుచున్నారు. ఈవాదము సుస్పష్టముగాను తర్కబద్ధముగాను చూపట్టుచున్నను బూటకపు వాగాడంబరమే సుడీ! కాగితముమీద వ్రాయునప్పుడు "నేను" అనుమాటను, చేయుచున్నాను, పోవుచున్నాను, కలగనుచున్నాను అనుమాటలను వేర్వేఱుగా వ్రాయవచ్చునేకాని, మనస్సులో వానిని వేఱుపఱుపఁ గలవాఁడులేడు.

నేను భుజించునప్పుడు నేను భుజించుచుంటిని అని తలంతును; అప్పుడు భుజించుట అను క్రియతో 'నేను' అభిన్నమైయేయుంటిని. నేను పరుగిడునప్పుడు "నేను"ను పరుగిడుట అను క్రియను రెండు భిన్నపదార్థములు కాఁజాలవు. కావున నరుడు వేఱొకదానితో ఐక్యభావమును పొందును అనువాదముఅంతబలమైనదికాదు. 'స్మృతినిఆధారముచేసికొనినయెడల రెండవ వాదమును దుర్బలమైనదే. నా అస్తిత్వమును (అనఁగా 'నేను' స్థిరముగా నున్నాను అనుటను) నాకుఁగల స్మృతియే తెలుపును అనినయెడల నేను మఱచి పోయెడు చాల విషయములు ఆవ్యక్తినుండి భిన్నములై పోవుచున్నవి అనవలయును. మఱియు కొన్ని స్థితులందు నరులు తమపూర్వవృత్తాంతమును పూర్తిగ మఱచుటయు కలదు. ఉన్మాదావస్థయందు అనేకులు తాము గాజువస్తువులమనియో లేక పశువులమనియో భావింతురు. అట్టి యొకని అస్తిత్వము (ఉనికి) వాని స్మృతిపైని ఆధారపడియున్నయెడల అతడు గాజు కావలెను; అట్లగుటలేదు గదా! కాఁబట్టి వాని ఆత్మను రుజువుచేయుటకు దుర్బలమగు వాని స్మృతిని ఆధారముగా చూపలేము. అందువలన ఆత్మపరిమితమై ప్రకాశించుచున్నను

---

* స్మృతి = జ్ఞప్తి.

సంపూర్ణమై శాశ్వతముగా నుండగలదు అను వాదమును చేపట్టి, గుణములనుండి ఆత్మను వేఱుచేయుటచేత ఆవాదమును నిలువబెట్టఁజాలము. సంకుచితమును పరిమితమును అగు ఒక ఆత్మకలదనియు, దానికి కొన్ని గుణములు చెట్టునకు గెలవలె అంటుకొనియుండుననియు రుజువుచేయుట అసంభవము.

ఇందుకు మాఱుగా ప్రాచీనబౌద్ధుల వాదమును కాంచుదు. ఈగుణములను దాటి మనము దేనినిగాని గ్రహింపలేము; గ్రహింపఁజాలము. ఈ వీరి వాదమే బలతరముగనున్నది. వీరి మతమున ఆత్మఅనునది యింద్రియానుభవములతోడను భావముతోడను ఏర్పడుచున్నది. అటువంటి ఒక రాశియే ఆత్మ; ఈరాశిసతతము వికారములను పొందుచున్నది.

అద్వైతసిద్ధాంతము ఈరెండు వాదములకును సఖ్యతను కూర్చుచున్నది. అద్వైతవాదము ఈరీతిగనుండును; గుణములనుండి వేఱుచేసిన వస్తువును కేవలము గ్రహింపఁజాలము అనుట నిజము; వికారమును వికారశూన్యతను ఏకకాలమున ఏకదేశమున భావింపఁజాలము. అది అసంభవమే. కాని వస్తువేదో, ఆపదార్థమే గుణముకూడ కాగలదు. వస్తువును దాని గుణమును భిన్నములగు రెండు పదార్థములుకావు. నిర్వికారమగు ఆత్మయే వికారమునందుచున్నట్లు గోచరించుచున్నది. ఈ జగత్తునందలి నిర్వికారపదార్థము దానికంటె భిన్నమగు వేఱొక పదార్థముకాదు. నిర్వికార బ్రహ్మము వికారములనుండి వేఱైన యొక పదార్థముగాదు. కాని ఆ నిర్వికార బ్రహ్మమే వికారములతో కూడినజగమై గోచరించుచున్నది. ఎన్నడును ఎట్టి వికారమును పొందని ఆత్మయే, మన దృష్టిలో

అనుభవములును, భావములును, తుదకు శరీరమును అయి చూపట్టుచున్నది. మనకు శరీరములు కలవనియు, ఆత్మలు కలవనియు, ఇట్టివి ఏవేవో కలవనియు తలచుటకు అభ్యాసపడి యున్నాము కాని, సత్యమునకు ఉండునది ఒక్కటియే సుడీ!

నే నొక శరీరమునని భావించుకొనునప్పుడు నేను శరీరము నే అగుచున్నాను. అప్పుడు నేను శరీరమును వినా వేఱొకటి అనుట అర్థశూన్యమగును. మరియు నేను ఆత్మనుగా భావించు కొనినప్పుడు శరీరము అదృశ్యమగును. శరీరభావనయే నిలువదు. తన శరీరమునుఁ గూర్చిన భావన అదృశ్యము గానిది ఎవ్వడును ఆత్మను గుర్తింపలేడు. గుణములదృష్టి అంతరించు వఱకును కేవల పదార్థమును ఎన్నడును గుర్తింపఁ జాలడు.

అద్వైతసిద్ధాంత మందలి రజ్జు సర్పభ్రాంతిసాదృశ్యము. ఈవిషయమును ఇంకను కొంత వివరముగ అర్థమగు నటుల చేయగలదు. త్రాడును చూచిఒకడు పాముగా భావించు నప్పుడు, త్రాడను దృష్టి నశించుచున్నది. దానిని అతడు త్రాడుగా చూచునప్పుడు పాము దృష్టి నశించి, త్రాడు మాత్రమే నిలిచి యుండును. అసమగ్రములగు ఉపపాదనలను అనుసరించి తర్కించుటవలన రెండు భిన్నపదార్థములున్న వనియు మూడు భిన్నపదార్థము లున్నవనియు భావనచేయుచు పోవుట తటస్థించుచున్నది. మఱియు అట్టి సిద్ధాంతములుగల పుస్తకములను చదువుటచేత ఆత్మయు శరీరమును వేఱు అను ద్వైతభావము సత్యమే అనెడు భ్రాంతిలో పడిపోవుచుందుము. ఇతరులు చెప్పగా నమ్ముచుందుము. కాని అట్టిద్వైతదృష్టి

* విషయ విచారణకు ఆధారముగా ఒప్పుకొనిన అంశములు *

యెన్నడును సత్యముకాదు. మన శరీరదృష్టియో లేక ఆత్మ దృష్టియో ఒక్కటి మాత్రమే ఎప్పటికప్పుడు నిలువఁగలదు. దీనిని రుజువుచేయుటకై వాదనలు అనవసరము. మీమనస్సులందు దీని సత్యమును సులభముగ గ్రహింపగల్గుదురు.

శరీరమునకు భిన్నమగు ఒక ఆత్మగా నిన్నుఁగూర్చి భావనచేసికొన ప్రయత్నించిచూడుము. అటుల భావన చేయుట నీకు అసంభవముగ తోఁచును. అటుల భావనచేయఁజాలిన వారికి ఆసమయమునందు, అనగా వారు ఆత్మ సాక్షాత్కారమును పొందినప్పుడు, వారికి శరీరదృష్టి కలుగదు. తదేక ధ్యాననిష్ఠచేతను, ఇంద్రజాలముచేతను, ఉన్మాదముచేతను, ఓషధుల ప్రయోగముచేతను, ఒకానొకప్పుడు విపరీత మనోదశలను పొందినవారిని మీరు చూచియుందురు. అటువంటి వారినిగూర్చి వినియుందురు. అభ్యంతరమున దృష్టి నిలుపబడి వారి బాహ్యదృష్టి నశించుచున్నదని వారి అనుభవముల వలన మీరు గ్రహింపఁగలరు. ఏదేదియున్నదనినను, అటులనుట ఒక్కదానిం గూర్చియే అని దీనివలన తేలుచున్నది. ఆఒక్కటియే బహురూపముల కానఁబడుచున్నది. ఈభిన్నరూపములవలననే కార్యకారణ పరంపర అను గొలుసు ఏర్పడుచున్నది. కార్యకారణములకుఁ గల సంబంధము పరిణామము! ఒకటి మఱొకటిగా మారును. అదియు వేఱొకటిగ మార్పుజెందును. ఒక్కొక్కప్పుడు కారణము అదృశ్యమై దాని స్థానమున కార్యముమాత్రము చూపట్టు నట్లుండును. ఆత్మ శరీరమునకు కారణముకాగా ఆసమయమున ఆత్మ అదృశ్యమై శరీరముఒక్కటియే నిలిచి యుండును. ఈ శరీర

మదృశ్యమైనప్పుడు ఆత్మ నిలిచి యుండును. ఆత్మఒకటియు శరీరము వేఱొకటియునై యిట్లు రెండు కలవను వాదనను ఖండించుచు వాదించు బౌద్ధులకు సమాధానమిది. ద్వైతస్థితి యేలేదు. పదార్థమును గుణమును ఒక్కటే. ఆ ఒక్కటే బహురూపముల కానవచ్చుచున్నది. దీనిని ఋజువుచేయు అద్వైతసిద్ధాంతము వలన వారికి సమాధానము సిద్ధించుచున్నది.

ఈ నిర్వికార భావము సమష్టిని గూర్చి మాత్రమే ఒప్పుననియు అందలి భాగముల గూర్చి ఒప్పదనియు తెలిసికొనియే యుంటిమి. భాగము అను భావనయే వికారము (మార్పు); చలనము అను భావనల పురస్కరించుకొని ఇది యేర్పడుచున్నది. పరిమితంబగు ప్రతిదియు వికారముతో కూడియుండును కావుననే దానిని మనము గ్రహింపగలము, తెలిసికొనఁగలము. పరిపూర్ణమగు సమష్టికి అంతకును భిన్నమై వికారమును పొందగల వేఱొకటి ఏదియు ఉండజాలదు గాన, సమష్టి (పరిపూర్ణము) నిర్వికారమై యుండి తీరవలయును. పూర్తిగ వికారరహితమగు దానిని గాని, తక్కువగా వికారమును పొందుదానిని గాని సూచించనిది, వికారమను భావమే అసంభవము.

వేదాంత సిద్ధాంతానుసారముగా ఆత్మ సర్వవ్యాప్తము నిర్వికారము, శాశ్వతము అను భావమును సాధ్యమైనంత

*ఒక సంఘట ఇంకొకదానికి కారణమగును. ఆ రెండవదానిని కార్యమందురు. ఇట్లు కార్యమయినది వేఱొకదానికి కారణముగ నేర్పడును. అప్పుడు కార్యమగు మూడవది మరియు ఒకదానికి కారణమగును. ఈవరుసక్రమం కార్యకారణ పరంపర అనబడును.

వఱకు ఋజువుచేయగలము. వ్యష్టినిగూర్చి మాత్రమే చిక్కు గలుగుచున్నది. అనుభవమున తప్పనట్టియు, మనను గట్టిగా పట్టుకొని విడువనట్టియు, ప్రాచీన ద్వైతసిద్ధాంతమును, అనఁగా పరిమితమై, అల్పమై, వ్యష్టిగతమైయుండు ఆత్మ ఒకటి కలదను భావమును ఏమిచేయగలము ?

సమష్టిని అనుసరించి మనము శాశ్వతమని గ్రహించితిమి; కాని ఆసమష్టిలోని భాగములుగా కూడ మనము శాశ్వతత్వమునే కోరుకొనుటలో చిక్కులేర్పడునుచున్నవి మనము అనంతులము అని గ్రహించితిమి; అదియే మన సత్యస్వరూపము. కాని సంకుచితములౌ ప్రత్యగాత్మల వ్యష్టిరూపమును కూడ నిలిపి యుంచుకొను వాంఛ మనయందు కలదు. సంతతము ప్రవర్ధనము పొందుచున్నను, ఈ సంకుచితాత్మలు వ్యష్టిస్వభావము గలవి అనెడు మన సామాన్యపు అనుభవము ఏమగును? అవన్నియు ఒక్కటిగ గోచరించుటలేదే! నిన్నటి "నేను" నేటి "నేనే" కాని కొంతమార్పు గలదు. ఈవికారము లన్నింటి నడుమను వీనికి భిన్నముగ నిర్వికారమగునది వేఱొకటి కలదు అను ద్వైతభావమును విడిచి ఆధునికమగు పరిణామసిద్ధాంతమునుఁ చేపట్టితిమేని "నేను" అనునది సదా వికారమును పొందుచు వికాసము నందుచున్నది అని గ్రహించగలము.

సూక్ష్మజీవకణము ఒకటి పరిణామము పొంది పొంది నరుఁడుగా మారినయెడల, ఆ సూక్ష్మజీవకణముగా ఉండి యున్నదే యిప్పుడు నరుఁడయ్యెననియు; కాని అది ఇప్పుడు చాలగా వికాసమును పొందియున్నదనియు తేలుచున్నది. ఈ సూక్ష్మజీవకణమునుండి నరుని వఱకు కలిగిన వికారపరం

పర పరిపూర్ణత్వమును పొందుటకై సాగుచున్న నిరంతర వికాసమే అగుచున్నది. ఈ వ్యష్టికి పరిపూర్ణత లభించుట అల అఖండమును జేరినప్పుడే! ఆ అఖండదశను చేరువఱకు నీలోపల నెడతెగక వికారమును పొందుచు వికాసమునొందుచు వ్యక్తి వ్యష్టిగనే నిలిచియుండును. వేదాంతసిద్ధాంతము యొక్క విచిత్రప్రతిభ తనకు పూర్వము వెలసిన సిద్ధాంతముల సమన్వయపఱచుటే సుడీ! చాల విషయములలో ఇది ప్రకృతి తత్వశాస్త్రమును బలపఱచినది. కొన్ని విషయములలో దానిని భగ్నపఱచియున్నది. భారతదేశపు ప్రాచీన తత్వవేత్తలు (యూరపువారు) పరిణామవాదము అని చెప్పుకొను సిద్ధాంతమును ఎఱింగియే యున్నారు. పరిణామము క్రమక్రమముగా సోపానసరణిని సాగుచుండును. దీనిని గ్రహించుటచేత వారు తమకు పూర్వమున గల సిద్ధాంతములను అన్నిటిని సమన్వయము చేయజాలిరి. అందువలన అంతకుఁ బూర్వమున్న భావములలో దేనినిగాని భగ్నము చేయులేదు. ఈ నిరంతర వికాసక్రియను చూచుశక్తిలేనిదై, ఆ కారణముచేత పరమావధిని పొందుకొఱకగు పరిణామ పరంపరయందు పూర్వము గడచిన సోపానావళిని సమన్వయపఱచుటకుఁ బ్రయత్నముచేయకపోవుటే బౌద్ధమతముయొక్క లోపము. మఱియును ఆపూర్వదశలను హానికరములుగను, వ్యర్థములుగను ఎంచి విసర్జించియున్నది.

మతవిషయములందు ఈ స్వభావము అనర్థదాయకము. ఒకడు నూతనమును శ్రేష్ఠతరమును అగు భావమును గ్రహించిన వెంటనే, తానిదివఱకు వహించిన భావములను విసర్జించివేసి తత్క్షణమే అవి అనవసరములనియు దుష్టము

లనియు కూడ నిర్ణయించుచున్నాడు. తన ప్రస్తుతదృష్టిలో అవెంత మూఢములుగ కాన్పించుచున్నను, అవే ఒకప్పుడు తనకు ప్రయోజనకరములుగ నుండి తాసీ ప్రస్తుత స్థితికి వచ్చుటకు అవి అత్యావసరములే అయ్యెననియు; మఱియు మనలోని ప్రతివాడు అట్టులనే మొదట మూఢభావములతో జీవించి వాని ప్రయోజనమును అనుభవించి, ఉత్తమ తరదశలను పొందవలసియుండుననియు, గ్రహింపలేకున్నాడు. అద్వైతసిద్ధాంతమో తత్పూర్వపు మహాపురాతన సిద్ధాంతములతో సయితము సఖ్యతగలిగి మెలగుచున్నది. ద్వైతము మున్నగు పూర్వసిద్ధాంతములను అన్నింటిని అద్వైతము అంగీకరించుచునేయున్నది. వానిపైని గర్వముతో కృపాంగవీక్షణ ముల పఱచుటవలనగాక, అవన్నియు సత్యములేఅనియు, ఒకే సత్యముయొక్క రూపాంతరములే అనియు సాదరముగా స్వీకరించి తాను సాధింపగలుగు పరమావధిని పొందుటకు అవన్నియు సాధనములే అనియు విశ్వసించుచున్నది.

మానవజాతి క్రమక్రమముగా గడవవలసిన యీ పూర్వ సోపానములను అన్నింటిని శపించక ఆశీర్వదించుచు పోషించవలయును. కావుననే ఈఅద్వైత ధర్మములనునిరసించి బహిష్కరించుటలేదు. వేదాంతమునందు అవి చెక్కుచెదరక నిలిచియున్నవి. పరిమితమయ్యెను, పూర్ణమై వెలుగు ప్రత్యగాత్మకలదను ద్వైతసిద్ధాంతమునకును ఈ వేదాంతమున స్థానము కలదు.

ద్వైతసిద్ధాంతమును అనుసరించి నరుడు మరణించునప్పుడు అతడు పరలోకములకు పోవుట మొదలగు భావములను వేదాంతము చెక్కుచెదఱకుండ నిలుపుచున్నది. పరిణామ

వాదమును అంగీకరించుటతో, అద్వైతసిద్ధాంతము అవి అఖండ సత్యముయొక్క ఖండ దర్శనములని చెప్పువానికి తగిన స్థలమును అంగీకరించియే యున్నది.

ద్వైతవాదము ప్రకారము ఈజగత్తు జడపదార్థము యొక్కగాని లేక శక్తియొక్కగాని కల్పనము అనబడుచున్నది. ఒకానొక సంకల్పము యొక్క లీలగా మాత్రము జగము భావింపబడుచున్నది. ఆ సంకల్పము జగత్తునుండి భిన్నముగా భావించబడుచున్నది. ఈ సిద్ధాంతమును బట్టి నరుఁడు తాను శరీరము ఆత్మ అను రెండింటి సమ్మేళనముగా భావించుకొనవలసినవాడగుచున్నాడు. ఆత్మ పరిమితమైనను, వ్యష్టియైన పరిపూర్ణమైనదే. నరుని శాశ్వతత్వము, భావి జీవితము మొదలగు విషయములగూర్చిన ఇట్టి భావములు అతనికిఁగల ఆత్మభావనను అనుసరించి వలెనగుచుండును. ఈ దశాంతరము లన్నిటిని వేదాంతము నిలువబెట్టుచునే యున్నది. కాన ద్వైతవాదమందలి సర్వసామాన్యభావములను కొన్నింటిని నేను వివరించిన చాలును. ఈ సిద్ధాంతము చొప్పున మనకు ఒక శరీరమున్నది. దాని మాటున ఒక సూక్ష్మశరీరముండును. ఈసూక్ష్మ శరీరము కూడ జడ పదార్థమయమే; కాని చాల సూక్ష్మావస్థలో నుండును. ఈసూక్ష్మశరీరము మనకర్మలను అన్నింటిని, అనగా మన చేష్టలను సంకల్పములను స్వీకరించుచుండును. వ్యక్తములై అంకురించుటకు దానియందు అవి సిద్ధముగా నుండును. మనము పూను ప్రతి సంకల్పమును, మనము చేయు ప్రతి పనియు, బీజరూపమునుపొంది అవ్యక్తముగా ఈ సూక్ష్మ శరీరమున వసించును. కొంత కాలమునకు బీజము అంకురముగా వెలువడి ఫలించును. ఈ ఫలములే

నరుని జీవిత వైఖరిని నిర్ణయించునవి. ఇటుల నరుఁడు తన జీవితమునుఁ దానే నిర్మించుకొనుచున్నాఁడు. నరుఁడు తనకై తాను నిర్మించుకొనిన దానికి మించిన యేయితర శాసనమునకును బద్ధుఁడై యుండుటలేదు. మంచిగాని చెడ్డగాని, మన సంకల్పములు, మన వాక్కులు మన క్రియలు అను దారములతో మనమే అల్లుకొనిన వలను మనమే పైనవేసికొనుచున్నాము. ఇటుల ఒకశక్తిని చంచలమున పెట్టుకొనిన మనము దానిఫలమును పూర్తిగ అనుభవించియే తీరవలయును. ఇదే కర్మసిద్ధాంతము. ఈసూక్ష్మశరీరమునకు వెనుక జీవుఁడు కలడు; అనఁగా నరుని జీవాత్మయుండును. ఈజీవాత్మయొక్క స్వరూప పరిణామములనుఁగూర్చిన తర్కవాదములు అనేకము కలవు. కొందఱి అభిప్రాయములో ఇది చాల చిన్నదై పరమాణువంతయుండును. అదంత చిన్నదికాదని కొందరందురు, అది చాల పెద్దదని మఱికొందఱి భావము. ఇట్లు అనేకవాదములు కలవు. ఈ జీవుఁడు సమష్టియందు ఒక అంశము, కావున శాశ్వతము, అనాది. ఇప్పుడున్నది అంతములేక పెఱుగుచునే యుండును. అది తన సత్యస్వభావమగు పావనత్వమును ప్రకటించుటకై ఆయా రూపముల పొందుచున్నది. ఈపరిణామమునకు అడ్డువచ్చు క్రియలును సంకల్పములును 'పాపములు' జీవుని వికాసమునకు తోడ్పడుచు దాని సత్యస్వభావమును ప్రకటించుటకు అనువగు ప్రతిక్రియయు ప్రతిసంకల్పమును పుణ్యము! హిందూదేశమున మూఢతములగు ద్వైతవాదులచేతను మహోన్నతాగ్రముల నిలుచు అద్వైతుల చేతను గూడ సామాన్యముగా అంగీకరింపఁబడు సిద్ధాంతము ఒకటి కలదు:—జీవుని శక్తులు అధికారము

అన్నియు వానియందే యుండునుగాని బాహ్యామునుండి వచ్చు టలేదు. అవి అన్నియు జీవునియందు అవ్యక్తరూపమున ఉండి యుండి యిప్పుడు ప్రకాశమునకు వచ్చుచున్న శక్తులే!

జన్మాంతర సిద్ధాంత మొకటి గలదు. ఈ శరీరము పంచత్వము నొందిన పిదప జీవునకు ఇంకొక శరీరమువచ్చును. అదియు పోయినప్పుడు మఱల ఇంకొకటివచ్చును. ఇట్లే ఈలోకముననో పరలోకముననో శరీరములు ప్రాప్తించుచునే యుండును. ఈలోకమే అన్నిలోకములలోను మనకు ఉపయోగకరమైనది గాన శ్రేష్ఠతమమైనదని దీనికే ప్రాముఖ్యత యీయబడుచున్నది! పరలోకములనగా దుఃఖము అంతగాలేని లోకములని భావించుటచేత అక్కడ ఇంకను ఉన్నతసంకల్పములు పుట్టుటకు అంతగా అవకాశము ఉండదు అని వారి వాదము. ఈలోకములో కొలదిగ సుఖమును విశేషముగ దుఃఖమును ఉండుటచేత, జీవుడు ఎప్పుడో యొకప్పుడు మేల్కాంచి, ముక్తికై ఆలోచించుటకు ఇక్కడనే అవకాశము మెండుగగలదు. పరలోకములోని జీవుని స్థితి ఈలోకములో శ్రీమంతుల స్థితివలెనుండి యింకను సుఖతరముగగూడ ఉండుట చేత, ఈలోకములోని శ్రీమంతులు ఉత్తమసంకల్పముల వహించుట అరిదియైనట్లే జీవునికి పరలోకములో పురోభివృద్ధి చింతకు అంతగా అవకాశము ఉండదందురు. అందు జీవునికి పరిపూర్ణారోగ్యవంతమై శ్రేష్ఠమగు శరీరము లభించును ఆకలి దప్పులుండవు, వాని కోర్కెలన్నియు ఫలించుచుండును. జీవుడక్కడ సౌఖ్యములపై సౌఖ్యములనే అనుభవించుచు తన నిజస్వభావమునెల్ల మఱచిపోవును. అయినను కొన్ని ఉత్తమ లోకములలో ఎన్ని సౌఖ్యము లున్నను ఉత్తరపరిణామమునకు

అవకాశము కలదు. జీవులు భగవంతుని సన్నిధానమున సదా వసించు మహాస్వర్గము ఒకటి కలదని కొందఱు ద్వైతులు భావింతురు. అక్కడ వారికి దివ్యశరీరములు దొఱకును. రోగముఁగాని మరణముగాని సంభవించదు. ఏ కీడును మూడదు. వారి యీప్సితములన్నియు సిద్ధించఁగలవు. అటువంటి వారిలో కొందఱు అప్పుడప్పుడు భగవంతుని పొందు మార్గమును ప్రజలకు బోధించునిమిత్తము భూలోకమునకు అవతరించుచుందురు. లోకమున ప్రభవించిన ప్రవక్తలు అటువంటివారే. వారిదివఱకే విముక్తిని సాధించియున్నారు. మహాస్వర్గమున భగవంతుని సమక్షమున నివాసములం కుదుర్చుకొని యున్నారు; అయినను దుఃఖభాజనులగు ఈ లోకజనులపై వారికిఁగల ప్రేమచేతను సానుభూతిచేతను, మానవకోటికి స్వర్గపథమును బోధించుటకై వచ్చి శరీరధారణ కావింతురు.

సరే. అద్వైతము మాత్రము దీనిని పరమావధి అని గాని పరమాదర్శము అని గాని అంగీకరించదు అనుట నిశ్చయము. విదేహకైవల్యమే దాని ఆదర్శము! ఆదర్శము పరిమితమై యుండఁజనదు. పరిపూర్ణత్వమునకు తగ్గినదేదియు పరమావధి కాఁజాలదు. పరిపూర్ణము అనఁగా అనంతము అనదగు శరీరము ఏదియు ఉండజాలదుగదా! పరిమితులున్నగాని శరీరాకారము ఏర్పడదుగాన అది అసంభవము. అనంత సంకల్పము అనునదియు ఒకటి యుండఁజాలదు. పరిమితియున్నగాని సంకల్పము పొసగదు. మనము శరీరమునకును సంకల్పమునకును అతీతముగా పోవలసియుండును అని అద్వైత సిద్ధాంతము. మరియు అద్వైత సిద్ధాంతానుగుణ్యముగ ముక్తి యిప్పుడు సాధించునదికాదు; అది యిదివఱకే యున్నది.

దానిని మనము విస్మరించి లేదనుకొనుచున్నాము. పరిపూర్ణత్వము సంపాదింపవలసినదై యుండలేదు; అది యిదివఱకే మనయందున్నది. అమృతత్వమును ఆనందము అనువానిని మనమిప్పుడు పొందుటకై పాటుపడవలసిన పనిలేదు. అవి మనకు ఇదివఱకే కలవు.

నీవు ముక్తుఁడవని ప్రకటించుటకు సాహసించితివేని ఈ క్షణమున నీవు ముక్తుఁడవే. నీవు బద్ధుడవనుకొంటివా బద్ధుడవుగానేయుందువు. ఇది అద్వైతము బోధింపసాహసించు సిద్ధాంతము. ద్వైతుల వాదమును దెలిపియేయున్నాను. మీకేది హితవుగఁదోచిన దానిని స్వీకరింపవచ్చును.

వేదాంతము బోధించు పరమాదర్శమును గ్రహించుట చాల దుర్లభము; దానిని గురించి మానవులు నిరంతరము జగడము లాడుచునేయున్నారు. ఉన్నకష్టమేమన తాము ఒకవిధమగు భావములను స్వీకరించినతోడనే, తద్భిన్నములగు భావనలనెల్ల ఖండించుచు అట్టి భావములను స్వీకరించువారితో పోరాటములకు దిగుదురు. మీకేవి అనుకూలములో వానిని మీరు గ్రహించుడు; ఇతరులను వారికి అనుకూలమైన వానిని స్వీకరింపనిండు. సంకుచితమగు వ్యష్టిత్వమును అంగీకరించి, ఖండజీవత్వమును ఆరోపించుకొని నిలిచిపోవచూతువేని నీ వాంఛలన్నింటిని పెట్టుకొని తృప్తిపడుము; వానితో కులుకుచుండుము. నీ జీవితానుభవము నీకు యోగ్యమై హృద్యముగ తోఁచినయెడల నీయిచ్ఛవచ్చినంత కాలము దానిని నిలుపుకొనుము. నీసుఖదుఃఖములకు నీవకర్తవగుటంజేసి నీవటులనే చేసికొనవచ్చును. నీవ్యక్తిత్వమును వదలమని నిన్నెవరును భాధించువారులేరు. నీయిష్టము వచ్చినంత

కాలము నీవు నరుఁడవుగానుండఁగలవు. ఎవరును ఆతంకపఱుప జాలరు. నీవు ఒక దేవతవుకానెంచుదో దేవతవుకాజాలుదువు. అదిస్థిరశాసనమే. కాని దేవతలుగాకూడ నుండనొల్లనివారుండ వచ్చును. వారి సంకల్పముమహాఘోరమనుటకు నీకేమియధికారముగలదు? నీకునూరురూకలు నష్టమైనయెడ నీవుదద్దఱిల్లిపోవచ్చును. అయిననుప్రపంచములో తమకుగలసర్వస్వముపోయినను మోహమాత్రమైన చిట్లించని వారుండగలరు. అట్టివారలు అనేకులుండియుండిరి. ఇప్పుడున్నారు. నీపరిస్థితులను బట్టి వారిని నీవు విమర్శింపఁబోనేల? నీవు నీసంకుచిత భావములనే పట్టుకొనివేలాడుము. ఈతుచ్ఛప్రాపంచిక భావములే నీకుఅత్యుత్తమాదర్శములై తోచవచ్చును. వానినే నీవు నిరాఘాటముగా సేవింపవచ్చును. నీవుకోరుకొనిన దశయే నీకుఁ ప్రాప్తించుచుండును. కాని యితరులున్నారు. వారు బ్రహ్మవిదులు. వారిలౌకిక బంధములకు లోబడుటకు ఇచ్ఛగించరు; వీనితోవారికి బనిముగిసినది. వీనికి అతీతముగ వారు నిర్గమింతురు. ఎన్నెన్ని సౌఖ్యములు ఉన్నను ఈప్రపంచము వారికి మురికిగుంటవలె తోచును. నీభావములచే వారిని నీవు బంధింపజూచుటేల? నీవిట్టి యత్నములను పూర్తిగ విడిచివేయవలసియున్నది. ప్రతివానికిని అవకాశమొసగుము.

దక్షిణ సముద్రద్వీపముల దాపున తుపానులో చిక్కు వడిన కొన్నియోడలఁ గూర్చి యొక కథను చదివియుంటిని. "ఇలస్ట్రేటెడ్ లండన్ న్యూస్" అను పత్రికలోఁ దాని సూచించు బొమ్మఒకటుండెను. ఆ ఓడలన్నియు భగ్నములై పోయినవి. ఒక్క ఆంగ్లేయ నౌకమాత్రము గండముగడచినది. ఆతుపానులో ప్రయాణము సాగించుచు పోవుచున్న

వారింజూచి మునిగిపోవుచున్న ఓడలపై నిలచినవారు కేళింతలు కొట్టుచున్నట్లు బొమ్మలలో చూపబడినది. వారివలె ధైర్య వంతుడవై సౌజన్యమూర్తివై వర్తించుము. నీవున్నచోటికే యితరులను పట్టిలాగజూడకుము. ఇంకొక వెఱ్ఱియూహ కలదు. మన సంకుచిత వ్యష్టిభావము పోయినయెడల ఐక్య భావము నశించుననియు, మానవజాతికి అనర్థము మూడు ననియు వాదించుచు, ఇంతకాలమును విశ్వమానవజాతి కొఱకై ప్రతివాదును ప్రాణార్పణము చేయుచు అల్లెమాట్లా డుదురు. అట్లయిన లోకము ధన్యమే! ప్రతిదేశమునను మానవ జాతికి ఉపకారము చేయబూనినవారు రెండువందలమంది స్త్రీపురుషవరేణ్యులు ఉండిరా అయిదు దినములలో సత్య యుగోదయము కాగలదు! విశ్వమానవ జాతియని పేరుపెట్టి మనము ఎంత ప్రాణార్పణము చేయుచుంటిమో మనకు తెలి యదా! ఇదంతయు వాగాడంబరముతప్ప మఱేమియును లేదు. సంకుచితముగా తమ వ్యష్టిత్వముంగూర్చి తలపోయునివారే లోకోద్ధారకులై వెలసిరనియు తమనుగూర్చియే సదామననము చేయుచుండు స్త్రీలును, పురుషులును ఇతరులప్రసక్తి నేపెట్టు కొనరనియు ప్రపంచచరిత్ర తెల్లము చేయఁగలదు. ఒక్క తెగ వారు స్వార్థత్యాగులు; రెండవ తెగవారు స్వార్థపరులు. క్షుద్రభోగలంపటులగుచు ఆభోగములనే తిరిగి తిరిగ కోరుచుం డుట నీచస్వార్థపరత ! అది సత్యాన్వేషణపర్వతముచే కలు గునదికాదు; జీవకరుణకాదు దీనికి మూలకందము ! "నాకే సర్వము రానీ; ఇతరులజోలి నాకేల?" అను నీచసంకల్పము తోను, మానవహృదయము నందలి క్షుద్రస్వార్థచింతతోను ఇదివెలువడుచున్నది. నాదృష్టికిఅట్టులదోచుచున్నది. తా మొక

అల్పజీవికి ఉపకృతిచేయజాలుచో అందుకొఱకై నూఱుజన్మల నైనను అర్పణముగావింపసిద్ధముగ నుండఁజాలు ప్రాచీనఋషుల వంటి, పురాణప్రవక్తలవంటి, ధర్మశీలురుహెచ్చుగ కల్గుగాక యని ప్రార్థన సల్పుదును, నీతి పరత్వము పరోపకారదీక్ష మాటలేనా? ఈకాలపు వ్యర్థప్రలాపముల కట్టిపెట్టుఁడు.

గౌతమబుద్ధునిబోలు మహానీతిశాలురు కావలయును; ఆతనికి సగుణ బ్రహ్మమునందు విశ్వాసములేదు. జీవాత్మ కల దని యతఁడు నమ్మలేదు. విచారమును అతడు పెట్టుకోలేదు. ఆతఁడు పూర్తిగ అజ్ఞేయవాది. అయినను ఎవరికైనను తనప్రాణమును అర్పింప సిద్ధముగనుండిన మహానీయుఁడు! పరోపకారమునకై తన జీవితమును అర్పణము గావించిన మహాత్ముఁడు! సదా సమష్టి క్షేమముననే విచారించిన ఘనుఁడు! ఆతని జనన వృత్తాంతమును వర్ణించు పట్టున, ఆతఁడు పలువురకు మేలుచేయుటకై, పలువురను ధన్యుల గావించుటకై, జననము గాంచినటుల చరిత్రకారుఁడు వ్రాసియున్నాడు. తన వ్యష్టిముక్తిని సాధించుటకై అతఁడు వనములకేగియుండలేదు. అతఁడీలోకమంతయు దహించుకొని పోవుచున్నట్లుభావించెను, ఇందుండి వెలువడు మార్గమును అన్వేషింపఁబూనెను. ఈ భూలోకమున ఇంతదుఃఖము ఉండనేల? అనునదే అతఁడు తన జీవితకాలమంతయు విచారణ చేయుచుండిన సమస్య! మనము బుద్ధునంత ధర్మశీలురమని చెప్పగలమా?

నరుడు స్వార్థపరుఁడైన కొలదిని అవినీతి పరుఁడగు చుండును. ఒక జాతియు అట్లే కాఁగలదు. స్వార్థచింతకు బద్ధమై యున్నజాతి, లోకములోనికెల్ల క్రూరమును దుష్టమును అగు చుండును. అరేబియా ప్రవక్త ప్రచారము చేసిన మతముకంటె

ద్వైతభావమును బట్టుకొని వ్రేలాడిన మతము ఇంకొకటి లేదు. అంత రక్తపాతము సలిపినట్టియు; అన్య జనులయెడ అంతద్వేషముం జూపినట్టియు మతము ఇంకొకటి లేదు. ఆబోధలను నమ్మని నరులను హత్యచేయుడను విధి ఖురానునందుఁ గలదట; అట్టివానిని వధించుటే వానియెడ కరుణజూపుటయట! విశ్వాస భ్రష్టులను చంపుటే, సౌందర్య మూర్తులగు అప్సరసలును, అనంతములగు విషయ భోగములును మెండుగఁగల స్వర్గమునకు పోవుసాధనమట! అటువంటి విశ్వాసముల మూలమున లోకమున ఎంతటి రక్తపాతము సంభవించినదో విచారించుడు.

క్రీస్తుమతమునందు అంత మూఢత్వముకాన్పించదు. కేవలము క్రీస్తుబోధించిన మతమునకును వేదాంత మతమునకును అంతగా భేదములేదు. అందును ద్వైత భావముగలదు; కాని ఆ పరమావధికి ప్రజలను చేర్చుటకుఁగాను వారికాధారముగా స్థూలతరమగు ఊతను అందించుటకై ద్వైత భావములగూడ క్రీస్తుబోధించి యున్నాడు. "స్వర్గమందున్న మా తండ్రీ" యని సంబోధించిన ఆ ప్రవక్త "నేనును నాతండ్రియు ఒక్కటే" అనియు బోధించి యున్నాడు. ఆప్రవక్త "స్వర్గమందలితండ్రి" ద్వారమున "నేనును నా తండ్రియు అభేదము" అను ఆదర్శమును చేరుటెరుఁగును. క్రీస్తుబోధించిన మతమునందు ధన్యవాదములు ప్రేమయు మాత్రమే జూపట్టును; కాని దానిలో కొంతమౌఢ్యము ప్రవేశించగానే అరేబియా ప్రవక్తమతమును బోలి అదియు పతితమైనది. ఈసంకుచితాత్మకై పెనగులాడుటయు, ఈయిహలోకముసందేగాక మరణానంతరమును స్థిరముగా అది ఉండవలయునని గోరుడు ఈ "అహం" ను పట్టుకు ప్రాకులాడుటయు మౌఢ్యమే అగును. దీనినేవాగు స్వార్థ

రాహిత్యమనియు, నీతికి పునాదియనియు కూడ చెప్పు దురు. అంతకంటె వివేకవంతులై యుండవలసిన స్త్రీ పురుషులు సయితము ఈ క్షుద్రవ్యష్టిత్వము పోయిన నీతియే ధ్వంసమగు నని భ్రమించుచు, దానిని అంతమొందించుట మీదనే నీతి ధర్మము ఆధారపడుననిన నిర్ఘాంతపోయి చూచుట ఆశ్చర్యకర ముగ తోచుచున్నది. విశ్వకళ్యాణమునకును నైతికక్షేమము నకును ధర్మసంజ్ఞయై యొప్పునది ఈ "అహం" కాదు. "త్వం" (నీవు) అనునది కాగలదని యెఱుంగుము. స్వర్గనరకములు ఉండిననేమి? లేకున్ననేమి? ఆత్మఉన్నను లేకున్నను ఏమి కొదువ? నిర్వికార బ్రహ్మము ఉన్నదో లేదో యెవరికి ఆ గొడవ? ప్రపంచము ప్రత్యక్షముగ కాన్పించుచున్నది; అందు దుఃఖము నిండియున్నది. అల బుద్ధుడు కావించినటుల ప్రపంచ ములోనికి బోయి యాదుఃఖమును తగ్గించుడు; లేదా ఆ ప్రయ త్నమున ప్రాణార్పణము సలుపుడు. నిన్న (,,అహం"ను) విస్మ రించుకొనుము. మున్ముంగుగా నేర్చుకొనవలసిన ధర్మమిదియే. నీవు ఆస్తికుడవైనను, నాస్తికుడవైనను, అజ్ఞేయవాదివైనను, వేదాంతివైనను, క్రైస్తవుడవైనను సరియే మున్ముందీ పాఠ మును నేర్చుకొమ్ము. అందఱును నేర్చుకొనవలసిన నీతిపాఠము సంకుచితాత్మను రూపుమాపి సత్యాత్మను ప్రతిష్ఠించు టేసుడీ!

బండి చక్రములీల ఒకదాని ప్రక్కను ఒకటిగా రెండు శక్తులు నడుచుచుండును. ఒకటి "నేను" (అహం) అను చుండును. రెండవది నేను కాదు (నాహం) అనుచుండును. ఇవి కన్పించుట నరునందేగాక పశువులందును మఱియు చిన్న పురుగులందును కూడ ఘటిల్లుచున్నది. నరునిపట్టి గోళ్ళతో చీల్చి వేడినెత్తురును త్రావు ఆడుపులి తన బిడ్డల రక్షించు

టకై ప్రాణములను అర్పింప సిద్ధముగనుండును. జంకుగొంకు లేక సోదరమానవుల వధించు నీచుఁడొకడు తన భార్యను బిడ్డలను సంరక్షించు నిమిత్తము ప్రాణముల కొల్పోవసిద్ధముగ నుండవచ్చును. ఇట్లే రెండు శక్తులును జగమందంతటను కూడి చరించుచున్నవి. ఒకటి కాన్పించుచోట రెండవదియు చూప ట్టును. ఒకటి స్వార్థపరత, రెండవది స్వార్థత్యాగము. ఒకటి సంపాదనము, రెండవది వ్యయము. ఒకటి స్వీకరణము; రెండవది దానము. బ్రహ్మాది పిపీలిక పర్యంతము ఈజగత్తు సర్వము ఈ రెండుశక్తులకును నాట్యరంగమై యొప్పుచున్నది. దీనికి రుజువే అవసరములేదు. తేట తెల్లముగా కాన్పించుచునే యున్నది.

కర్మయంతయు అనగా విశ్వపరిణామ మంతయు, స్పర్థ (వైరము) రూపమును తాల్చు ఒక్కశక్తి మీఁదనే ఆధారపడి యున్నదనుటకు సంఘమందలి యేపక్షమువారికిని యర్హతలేదు. జగత్తునందు జరుగు కర్మనంతటిని క్రోధము, వైరము, స్పర్థ, పోరాటములపైని ఆధారముచేయుటకు వారికి ఏమిఅధికారము గలదు? ఇవి ఉన్నవి అనుటకు ఆక్షేపణలేదు. కాని రెండవశక్తి యు పనిచేయుచున్నది అనిన లేదు అనుటకు ఎవనికి హక్కు లేదు. ఎవరైనను ప్రేమ అనగా "నాహం" నేనుకాదనుట (అనగా త్యాగము) సయితము జగత్తున పనిచేయు ప్రత్యక్ష శక్తిగా లేదని వక్కాణింపఁగలరా? అయినను మొదటిదియు ప్రేమశక్తియొక్క వక్రరూపమే అనవచ్చును. ప్రేమశక్తియే స్పర్థకు మూలము కాఁగలదు. నిజముగా స్పర్థకు జన్మస్థానము ప్రేమయే. దుర్మార్గమునకును మూలము స్వార్థరాహిత్యమే. పాపమునకు ఆది పుణ్యము; తుదయు పుణ్యమే! సత్యాన్యశక్తి

యొక్క వక్రగతియే దుష్కర్మ! నరహత్యలు కావించు నతడు ఒకవేళ తన బిడ్డపై గల ప్రేమచేతనే అటుల కావించు చుండ వచ్చును. అతని ప్రేమ జగమునగల కోట్లకొలంది ప్రజలను కాదని సంకుచితమై, వానియొక్క చిన్నబిడ్డచేత పరిమితమై పోయియుండును! ఇట్లు పరిమితమై పోయినను అది ప్రేమయే సుడీ!

కావున ఈజగత్తునకు అంతకు ఆధారమై వఱలుశక్తి, యేమార్గమున ప్రకటనకు వచ్చినను ఒక్కటే! ఆ అద్భుత శక్తియే స్వార్థరాహిత్యము, త్యాగము, ప్రేమ, అనంబడుచు, జగమున సత్యమగు చైతన్యశక్తియై వరలుచున్నది. కాబట్టి వేదాంతి అద్వైతమును ప్రతిపాదించుచుండును. జగత్తునకుమూలములై రెండుశక్తులుండును అనజాలముగాన మనమిట్లు వివరణము కావింపవలసి యున్నది. అద్భుతమై మనోహరమై వెలయు ప్రేమయే సంకుచితమగుటచేత పాపము, దౌర్జన్యము ఇటగాన్పించుచున్నవి అని ఒప్పుకొంటిమా, ఒక్కప్రేమశక్తిని అనుసరించియే జగత్తుయొక్క చర్య సర్వమును తెల్లమై పోవుచున్నది. కాదేని జగత్కారణములై ఒప్పు రెండుశక్తులున్నవి అనవలసి వచ్చుచున్నది. ఒకటి పుణ్యము, రెండవది పాపము. ఒకటి ప్రేమ, రెండవది ద్వేషము. ఏదియెక్కువగా తర్కపరీక్షకు ఆగగలదు? ఏకశక్తి సిద్ధాంతమే నిలుచును అనుటకు సందియము లేదు.

ద్వైతభావమునకు సంబంధించనటుల తోచు విషయములగూర్చి యిక విచారింతము. ద్వైతుల వాదముంగూర్చి నేనింక వివరింపదగదని తోచెడిని. ఉత్తమోత్తమమగు ఆధ్యాత్మికతత్వమునకు అనుసరణముగా అత్యుత్తమమును స్వార్థరహితమును అగు నైతికాదర్శము నడచుచున్నది. నీతులను ధర్మ

ములను ప్రతిపాదించుటకొఱకై యీ యాదర్శమును క్రిందు చేయుట అవసరములేదు. అందుకు మారుగా నీతికిని ధర్మమునకును పునాదులు వేయుటకు, మహోన్నతములగు తాత్విక భావములును, ప్రకృతి శాస్త్రనిర్ణయములును శరణ్యములగునని చూపుటయే నాయుద్దేశ్యము. మానవజాతి కల్యాణమునకు నరుని విజ్ఞానము విరుద్ధమైనదికాదు. మఱియు మన జీవిత విషయములందు ఎల్లెడల జ్ఞానమే తారకము. జ్ఞానార్జనమునందే భగవదారాధనయు ఇమిడియున్నది. ఎంత జ్ఞానమును సంపాదించిన అంత శ్రేయస్కరము. అనర్థమై చూపట్టు సర్వమునకును మూలము అఖండబ్రహ్మమును పరిమితముగా భావించుటే అని వేదాంతవాదము. పరిమితమై సంకుచిత మార్గముల నడచు, దోషముగా కానవచ్చు ప్రేమయే, తుదకు రెండవ కొనయందు భగవత్స్వరూపముగ ప్రత్యక్షము కాఁగలదు. మఱియు దోషములకు మూలకారణము మనయందేయున్నదని వేదాంతము తెలుపుచున్నది. ప్రకృతికి అతీతమగు ఏదైవతమునో నిందింపబోకుడు; ఆశలవిడిచి దిక్కులేదని విలపింపకుడు. ఎవరో వచ్చి మనకు చేయూతనిచ్చిన తప్ప మనము తరించు త్రోవలేదని వాపోవకుడు. అది అసంభవమని వేదాంతము బోధించుచున్నది. మనముకంబళిపురుగులలీల నున్నాము. మనలోపలనుండియే మనము దారమును కల్పించుకొని, గూడును అల్లుకొని, క్రమక్రమముగ దానిలో మనను మనమే చెఱబెట్టుకొనుచున్నాము. కాని యిది చిరకాలము ఇటులనే జరుగదు. ఆ గూడులోనే పరమార్థజ్ఞానసాధనగావించి, భ్రమరమువలె ముక్తులమై వెలువడుదుము. 'కర్మ' అనుగూటిని మనచుట్టును మనమే అల్లుకొను చున్నాము.

అజ్ఞానముం జేసి మనము బద్ధులమైతిమని భావించి విలపించుటకును, రక్షణకై విలపించుటకును మొదలిడుచున్నాము. వెలుపలినుండి యేసహాయమును రాఁబోదు; అది మనలోనుండియే రాఁగలదు. విశ్వమునందలి దేవతలను అందఱినిఁ గూర్చియు మొఱలిడుటేల? అనేక వత్సరములు నేను మొఱలిడియుంటిని. తుదకు నాకు సహాయము లభించినది. కాని సహాయము నా అభ్యంతరమునుండియే ప్రాప్తించినది. అప్పుడు నేను అజ్ఞానముచేత కావించినది అంతయు రద్దుచేసికొనవలసివచ్చినది. ఇదొక్కటే మార్గము. నాచుట్టును నేనే అల్లుకొనిన గూటిని నేనే భేదింపవలసివచ్చినది; అందుకు వలయుశక్తియు నాలోపలనే యున్నది. ఒక్క విషయమున మాత్రము నాకు నిస్సంశయము:— సక్రమముగ నడచినను అక్రమముగ నడచినను, నాజీవితము నందలి ఒక్కసంకల్పమేని వృథాకాఁజాలదు; మంచిదిగాని చెడ్డదిగాని, నాపూర్వవర్తనమంతకును ఫలమే నాప్రస్తుత దశ. నా జీవితమున నేను అనేక లోపముల కావించి యుంటిని, కాని ఆలోపములలో ఏది లేకున్నను, నేను నా ప్రస్తుత స్థితికి వచ్చియుండక పోదును అనిగట్టిగ నమ్మెదను. వానిని కావించినందుకు నేను పూర్ణసంతృప్తుఁడనై యున్నాఁడను. అట్లనుటవలన మీరిక ఇండ్లకుబోయి బుద్ధిపూర్వకముగ దోషములను ఆచరింప వచ్చునని నా భావముకాదు సుడీ! నాపలుకులకు ఆరీతిగా అపార్థము చేయకుడు. కాని లోపములను కావించి యుంటిమిగదా యని విలపింపబోకుడు; తుదకు అన్నియు చక్కబడునని తెలిసికొనుడు. గత్యంతరములేదు. మన స్వభావములందు సౌజన్యమున్నది; మన నైజములో పవిత్రతయున్నది. మఱియు మనప్రకృతిని నాశమునొందించు

టకు వలనుపడదు. మన సత్యస్వభావము సదా ఒక్కటిగనే నిలిచియుండును.

మనము ఇప్పుడు గ్రహించవలసినది ఇదియే; మనము దుర్బలురమగుటచేత లోపములుగాని దోషములుగాని చేయుచున్నాము; మన అజ్ఞానమే మన దుర్బలతకు కారణము. లోపములు అనుపదమును ప్రయోగించుటే నాకిష్టము. 'పాపము అనుశబ్దము ప్రప్రథమమున సవ్యముగానే ప్రయోగింపబడినను ఇప్పుడు నాకుభీతి గొలుపు కొన్నిలక్షణములు అందు జేరినవి. ఇక మనను అజ్ఞానులుగా చేసినది ఎవరు? మనయంట మనమే మనచేతులను కండ్లపైని పెట్టుకొని చీకటిగానున్నది అని విలపించుచున్నాము. చేతులను తొలగించుకొందము. వెలుతురు కాన్పించును. జీవాత్మయొక్క స్వప్రకాశత, సతతము మనకొరకై వెలుగుచునే యున్నది. మన ఆధునిక ప్రకృతి శాస్త్రవేత్తలు ఏమనుచుండిరో వినలేదా? పరిణామమునకు అంతకును కారణమేది? ఇచ్ఛ! పశువొక పనిచేయుటకు ఇచ్ఛగించుచున్నది. పరిస్థితులు దానికి అనుకూలముగ కాన్పింపవు. కావున అదొక నూతన శరీరమును కల్పించు కొనుచున్నది. ఎవరీ పరిమాణమునకు కర్త? ఆపశువే దానియిచ్ఛయే! అత్యల్ప జీవకణమునుండి నీవిట్టిపరిణామమును పొందివొచ్చితివి. నీయిచ్ఛావ్యవసాయమును ఇంకనుసాగించుము. అదియే ఇంకను నిన్నుద్ధరించగలదు. ఇచ్ఛాశక్తి అనంతము, అది సర్వశక్తివంతమై యుండ నేనెందుకు దేనినైనను జేయజాలనని నీవు ప్రశ్నింపవచ్చును. కాని (అట్లు ప్రశ్నించునప్పుడు) నీవు నీసంకుచితాత్మనుగూర్చి మాత్రమే యోచించుచు చున్నావు. సూక్ష్మజీవ కణమునుండి

మానవ రూపమును పొందువఱకును, వెనుకకు తిరిగి నీదశాంత రముల చూచుకొనుము. నీయిచ్ఛ సర్వశక్తిమంతము కాదు అనెదవా యింకను? నిన్నింత యున్నతికి దెచ్చినశక్తి, యింక ను నిన్నుద్ధరించఁజాలును. ఇచ్ఛాశక్తిని బలపఱచు శీలము నీ కవసరముగానున్నది.

నీవు కొన్ని యెడల దోషములను ఆచరించితివి; కాన నీవు ఇంటికిఁబోయి చింపిగుడ్డలును కట్టుకొని బూడిదలోఁపడి దొర్లుచు బ్రతికిఉన్నంతకాలమును రోదనముచేయుమని నేను బోధించిన యెడల నీకది సహకారి కాజాలదుగదా? నిన్నిం కను దుర్బలుని కావించును; ధర్మము దిశకుమారుగా నిన్ను ఇంకను దోషమువైపుకే యీడ్చుకొనిపోవు మార్గమును చూపినవాడనగుదును. ఈగ్రహము వేలకొలది సంవత్సరము లనుండి చీకటిగానున్న యెడల నీవు అందు కూర్చుండి "అయ్యో చీకటి! అయ్యోచీకటి!!" అని రోదనము చేయుచు విలపించినచో, చీకటిపోవునా? ఒక్కనిప్పు పుడకగీయుము క్షణములో వెలుగునిండును. "అయ్యో నేను పాపముచేసి తిని, అకటా నేను ఎన్నియో దోషములు కావించితిని" అని నీజీవితమెల్ల తలపోయుచు కూర్చుండిన ఫలమేమి? నీకు సభూతమోఁ వచ్చి బోధచేయు అవసరములేదు వెలుగును కల్పించుము, దోషము దానంతట అదియే క్షణములో అదృ శ్యముకాఁగలదు. శీలమును నిర్మించు కొనుము, తేజో మయమై, ప్రకాశవంతమగు సదా పునీతమగు నీసత్యస్వభావ మును ప్రకటింపుము. నీకుఅగపడు ప్రతిదానినుండియు దానిని ప్రజ్వలింపజేయుము. నీచాతినీచునందును సయితము గల సత్యాత్మను ప్రత్యక్షముచేసుకొన జాలి, వానిని దూషించుటకు

మారుగా, "లెమ్ము; ఓ తేజస్వీ! మేల్కొనుము, నిత్యపావన మూర్తీ! ప్రబోధముగాంచుము, జననమరణ రహితుడా! నిద్రలెమ్ము; సర్వశక్తి సంపన్నుడా! సర్వాగ్రగుడవుకమ్ము, నీనిజ భావమును చూపుము. సంకుచితములగు ఈ అవతారములు నీకు అర్హములుకావు సుమీ!" అనుచు వారిని ప్రబోధింపఁ జాలుసమర్థత మనకందఱకును అలవడినచో ఎంతబాగుండును. అద్వైతము బోధించు అత్యుత్తమధ్యానము ఇదియే. ఇదియే యేకైక ధ్యానము. మన సత్యస్వభావమును సంస్మరించుచే మనలో సదా వెలుంగు ఈశ్వరుని పరిపూర్ణునిగను, సర్వశక్తి వంతునిగను, నిత్యశుభంకరునిగను, సంతతోపకారిగను, స్వార్థ రహితునిగను, అనంతునిగను, నిరంతరము ధ్యానముచేయుటే మహోత్తమ ప్రార్థన. ఆస్వభావము స్వార్థరహితమైనది; కాన బలాఢ్యమైనది, నిర్భయమైనది స్వార్థపరుని భీతి బాధింపగలదు. కాని తనకై దేనిని కోరనివాడు ఎవరికి భయ పడును? వానిని ఏది భీతిలచేయఁగలదు? మరణమున్నను వాని కేమిభయము? ఏదోషమును గూర్చి ఆతడు భీతి నందును? కాబట్టి మనము అద్వైతవాదులమైనచో, ఈ క్షణ మునుండియే మన పూర్వపు "అహం" భిన్నమై చనునని మన నము చేయుందగును. ఆపేరున ఈపేరున పలుగువ్యక్తులందరు అదృశ్యులగుదురు. అట్టి దృష్టి అంతయు అజ్ఞానము నిత్యశుద్ధ మును శక్తివంతమును సర్వజ్ఞమును అగు బ్రహ్మము మాత్రము నిలిచియుండును. మనకు ఆ ఒక్క బ్రహ్మమే గోచరింప గలదు అంతట మన భీతియెల్ల తొలగిపోవును. సర్వవ్యాప్తమై తేజరిల్లు మనను ఎవడు బాధింపనోపును? అప్పుడు మన దుర్బలతయెల్లయు తొలగును. ఇక మనతోడివారిలో అజ్ఞాన

మును ప్రబోధింపగలము, వారును ఆ పవిత్రాత్మయే యని మనము గ్రహించితిమి. వారికి మాత్రమది తెలియకుండెను. మనము వారికి దానిని దెలిపి వారును తమ యనంతస్వరూపమును గూర్చి ప్రబోధము గాంచునటుల చేయువలయును. ఇప్పుడు ప్రపంచమందెల్ల జరుగవలసిన పని యిదని నా భావము. ఈసిద్ధాంతములు చాల పురాతనములై యుండ నోపు. సత్య మనంతము. సత్య మొకని స్వాస్థ్యముగాదు. ఏ జాతిగాని యేవ్యక్తిగాని అది తనదని వాదింప వీలులేదు. సత్యము సర్వాత్మల యొక్కయు సహజలక్షణము! ఎవ డది కేవలము తనదని వాదింపఁజాలును? కాని యీ భావనను అనుష్ఠానయోగ్యముగ నొనరించవలయును. సుగ్రాహ్యముగ జేయువలయును. అప్పుడుమహోన్నత సత్యములన్నియు (ధర్మములన్నియు) సుగ్రాహ్యములై వెలయును. అప్పుడీ తత్త్వము మానవజాతి యందెల్లెడల వ్యాపించి, మహామనీషాగ్రగణ్యులకును, సర్వసామాన్యులకును, స్త్రీకిని, పురుషునకును, శిశువునకునుఁగూడ లభ్యమై వరలగలదు. తర్కవాదములును, క్రతువులును, ఆయాకాలములందు మహోపకారములే యైనవి! ఇప్పుడో సులభతరత మార్గములు సమకూరి ప్రతినరుడును సాధకుఁడై ప్రతినరునందలి సత్యస్వరూపమును పూజార్హవిగ్రహమునై పఱగు సత్యయుగమును ప్రారంభింతుముగాక!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓమ్ తత్ సత్.



BCI

| | | | |
|---|---|---|---|
| 27 | యథార్థభారతి, చిన్నపొత్తము | ... | 0—2—0 |
| 28 | యజ్ఞము | ... | 0—8—0 |
| 29 | జ్ఞానామృతము | ... | 0—1—6 |
| 30 | నిత్యప్రార్థన | ... | 0—1—6 |
| 31 | శ్రీభగవద్గీత 1. మూలము. 2. పదవిభాగము, 3. పదపదార్థము, 4. తాత్పర్యము, 5. విశేషార్థములతోకూడినది | | 6—0—0 |
| 32 | ,, మూలము తాత్పర్యముతో కూడినది | | 2—0—0 |
| 33 | ,, మూలము మాత్రము | ... | 0--10—0 |
| 34 | ఓంకారపటము | ... | 0—4—0 |
| 35 | మోక్షద్వార ప్రకృతిద్వారముల ఛాయాపటము | ... | 0—2—0 |
| 36 | నమశ్శివాయగేయామృతము | ... | 0—1—6 |
| 37 | అహింసాపుష్పము | ... | 0—2—6 |
| 8 | భజగోవిందము | ... | 0—2—0 |
| 9 | శ్రీసద్గురు మలయాళస్వామి జ్ఞానామృతము | ... | 0—6—0 |
| 0 | గృహస్థాశ్రమ ధర్మము (దివ్యజననం) | ... | 2—0—0 |
| 1 | గాయత్రీమంత్రము | ... | 0—12—0 |
| 2 | బ్రహ్మచర్యము | ... | 1—4—0 |

# యథార్థభారతి.

## ఆధ్యాత్మ విద్యావిషయక మాసపత్రిక.

చందా సంవత్సరం 1—కి రూ. 3—0—0.

---

కావలయువారు, ఈక్రింది విలాసమునకువ్రాసి తెప్పించుకొనవచ్చును:—

**మేనేజరు, శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడుపోస్టు, (చిత్తూరుజిల్లా.)**

# ఇతర గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1. | శ్రీయోగవాసిష్ఠము సంపూర్ణము 32 వేలశ్లోకములు తెలుగు తాత్పర్యసహితము 4 వాల్యూములు ... | 45_0_0 |
| 2 | ఆత్మపురాణము ప్రథమ భాగము. ... | 5_[illegible] |
| 3 | డిటో ద్వితీయ భాగము. ... | 3_[illegible] |
| 4 | అనుభూతి ప్రకాశము (శ్రీవిద్యారణ్యముని ప్రణీతం) | 6_[illegible] |
| 5 | వేదాన్తబాలబోధము ... | 2_[illegible] |
| 6 | శివయోగ ప్రదీపిక ... | 1_[illegible] |
| 7 | సద్గురుపాదుకాస్తవము ... | 0_4_0 |
| 8 | శాన్తిమంత్రములు ... | 0_2_0 |
| 9 | పరమార్థవినోదము ... | 0_12_0 |
| 10 | వైరాగ్యసారసంగ్రహము ... | 1_0_0 |
| 11 | వృత్తిరత్నావళి ... | 0_12_0 |
| 12 | మోక్షసారము ... | 0_2_0 |
| 13 | వ్యాసాశ్రమస్థలమాహాత్మ్యము ... | 0_4_0 |
| 14 | ఓంకారప్రభావము ... | 0_12_0 |
| 15 | గరుడపురాణసారము ... | 0_12_0 |
| 16 | యతిగీతము (శ్రీవివేకానందప్రణీతం) ... | 0_4_0 |
| 17 | ధర్మపదము (బుద్ధగీత) ... | 0_12_0 |
| 18 | దుఃఖనివారణోపాయము (రామతీర్థప్రణీతం) ... | 0_4_0 |
| 19 | శివపంచాక్షరీ భాష్యము ... | 0_4_0 |
| 20 | ప్రశ్నోత్తరమణిరత్నమాల (శ్రీశంకరాచార్యవిరచితం) | 0_2_0 |

---

వలయువారు, ఈ క్రింది విలాసమునకువ్రాసి తెప్పించుకొనవచ్చును:-

**మేనేజరు, శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడుపోస్టు, (చిత్తూరుజిల్లా.)**

| పరిస్థితి | |
| --- | --- |

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | TPLA102B104 |
| పుస్తకం పేరు | [illegible] వేదాంతము |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hasin |
| పేజీలు విడదీసినది | nandini |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | no |
| పరిస్థితి | good |